శ్రీగురు

శ్రీ గురుభ్యోనమః

# అసంప్రదాయక ప్రబోధ ప్రచారములు

అను

పోకలవారి సాంప్రదాయక ప్రబోధ ప్రచారవిమర్శ

"భావార్థదీపికా" నామకవ్యాఖ్యావిమర్శ

రచయిత:

యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు, BA, BL.,

"రాజయోగి" సంపాదకుడు

# మంగళనాన్ని డి

శ్రీ మదచలఋషి రామడుగు శివరామ దీక్షిత గురుపీఠ సాంప్రదాయక నిజప్రబోధ విధానము, వున్నదున్నట్లుగా ప్రచారము చేయుట. అసంప్రదాయక ప్రబోధ ప్రచారములు అరికట్టుట, నిజసాంప్రదాయక భక్తులందరి యొక్క ధర్మమైయున్నది. ఏతద్ధర్మము ననుసరించి, కొడిమ్యాల గ్రామమునుండి నంగనర్సింహస్వామిగారు యీ క్రింది విధముగా మాకు వ్రాసియున్నారు. "ఈ మధ్య శుద్ధ నిర్గుణతత్వ కందార్థదరువులు (భాగవత కృష్ణయ్యగారు రచియించినది) 'భావార్థదీపిక' అను గ్రంథము వెలువడింది అందులో అచల పీఠమునకు పరంపరా ఆదిగురువులు శ్రీహరి, దినకరుడు కాదని వేరే, వశిష్టుఋ జనకులు అని అంటారు. నిజమేదో "సెలవీయగలరు" అని వ్రాసియున్నారు.

ఏతద్విషయంలో విచారించగా—"శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దరువులు (శ్రీ బ్రహ్మానందీయ భావార్థ దీపికా సహితం)" అనే పేరుతోను, వ్యాఖ్యాత-"స్వామి, శ్రీ బ్రహ్మానందగిరి సద్గురు మహరాజ్"-అనియు వెల 5/-లు అనియు మాకు తెలియవచ్చినది (గ్రంథకర్త మాకు పరిచితులే. వీరు పోకలవారి సాంప్రదాయకులు తదుపరి సన్యసించి పేరు మార్చుకొని, వారి పూర్వ సాంప్రదాయమునకు స్వస్తిచెప్పి, అద్వైత సిద్ధాంతమునందు ప్రచారకులై మరల యిప్పుడు శివరామ దీక్షితీయ సాంప్రదాయమున ఒక గురువుగా ప్రచార ప్రబోధములుగావించుచున్నట్లు తెలియుచున్నది-వీరిప్రస్తుత గ్రంథము మా కార్యాలయమునకు చేరినది. పరిశీలనలో నున్నది.

పోకలవారి సాంప్రదాయక పూర్వప్రబోధకులతో శ్రీవారు (శ్రీ మద్రామద్గు శివరామ దీక్షిత గురుపీఠాధ్యక్షులు శ్రీ మదచల ఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారు శికింద్రాబాద్ జరిపిన చర్చలు పోకలవారు

అచ్చువేయించిన కందార్థ గ్రంథములో వారు చేసిన మార్పుల యొక్క అనౌచిత్యమును శ్రీవారు సూచించగా అవి వారు సవరించుకొన్న విధానము) కొంతవరకు యిదివరకే గ్రంథస్థముచేయుట జరిగినది. ప్రస్తుతము ప్రకటించబడిన గ్రంథము కొంతవరకు పరిశీలించుట జరిగినది. పూర్తిగా పరిశీలించి యీ పత్రికా ముఖముగా నిజసాంప్రదాయక గురుపరంపరా విషయము, గుణదోష నిరూపణ, గ్రంథస్థ విషయములకు మాసమీక్ష యికనుండి ప్రతినెలా క్రమముగా ప్రకటించదలచుకొన్నాము గ్రంథకర్త తమ "ముందు మాటలో"— ఇందలి యొప్పులను గ్రహించి, తప్పులను మాకు తెలిపెడి సుజనులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలని తప్పులనే వెదకుచుండెడి కుజనులకు మా ధిక్కారములు" అని వ్రాసియున్నారు. అట్టి నిందాస్తుతులతో మాకు నిమిత్తములేదు. నిజసాంప్రదాయమును పరిరక్షించి శుద్ధమగు శ్రీ శివరామ దీక్షిత ప్రబోధమును ప్రచారము చేయుట మా విధి. ఈ విధి నిర్వహణమునందు దేనికిన్ని భయపడము.

1. తాము శ్రీశివరామదీక్షితుల సాంప్రదాయకులమని లోకమును నమ్మించుటకు పోతులూరి వీరబ్రహ్మంగారి గురువుగారి చాయపటమును బ్లాకు చేయించి వీరే శ్రీశివరామదీక్షితులవారని నమ్మటకు.

శ్లో॥ వందారు జనమందారం । వందేహం తన్నిరంతరం ।
రామదుగు వంశజంశుద్ధం । శివరామాఖ్యదీక్షితం॥ అని వ్రాసినారు.

2. దీనితోపాటు శ్రీశివరామదీక్షితుల వంశవృక్షము అను పటమును నిర్మించినారు.

3. పుట్టందుడగు సూరుదాసు శ్రీకృష్ణపరమాత్మవున్న పటమును బ్లాకుతీసి సాందీపమహరుషి శ్రీకృష్ణభగవానునినికి పరిపూర్ణబోధ చేయుచున్నాడని. ''సాందీపమీశం కృష్ణంచఅర్జునం'' అని వ్రాసినారు.

ఇట్లు
(''రాజయోగి'' సంపాదకుడు)



ఆసిఫాబాద సభాసదులు మరియు శ్రీవారి భక్తమండలి

## సాంప్రదాయక ప్రియశిష్యులు



అ. ప॥ మోటూరి లక్ష్మీరాజ్యంగారు, సతీమణి వరలక్ష్మి

మంచిర్యాల.

## సాంప్రదాయక ప్రియశిష్యులు



అ. ప॥ మోటూరి భూమయ్యగారు, సతీమణి గంగమ్మ

నంనూర్ సర్‌పంచ్.

సాంప్రదాయక ప్రియశిష్యులు



**అ॥ వ॥ మోటూరి బుచ్చిలింగంగారి భార్య బూమక్క**

నంనూరు.

## సాంప్రదాయక ప్రియశిష్యులు



అ॥ ప॥ యెలగందుల లింగయ్యగారి కుమారుడు నారాయణ

వెల్గుమట్ల.

# అసంప్రదాయక ప్రబోధ ప్రచారములు

## గు రు ప ర ం ప ర

### (అసంప్రదాయకుల నిర్ణయాలు)

పోకలవారి సాంప్రదాయకుడగు వ్యాఖ్యాత శ్రీ బ్రహ్మానందగిరి, "సద్గురు పరంపరా స్తోత్రము" వొకదానిని నూతనముగా రచించి తమ వ్యాఖ్యాన గ్రంథమునందు (కందార్థ గ్రంథమందు) అచ్చొత్తించినారు.

"ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో, వంశఋషిభ్యో, మహద్భ్యో, నమోగురుభ్యః", అని అందరూ (అద్వైత సంప్రదాయకులు సహా) చెప్పుకొనుచుండగా, యిది తొలగించి, దాని స్థానే "ఓం నమశ్శివాదిభ్య, శివప్రబోధిత అనంతోపనిషత్సిద్ధాంత బృహద్వాశిష్ఠ (ప్రబోధక-యీ మాటవారే కొట్టివేసినారు). సంప్రదాయ కర్తృభ్యో, వంశర్షిభ్యో, మహద్భ్యో నమోగురుభ్యః" అని వ్యాఖ్యాత ప్రారంభించినారు.

ఈ మార్పుకు కారణం, వ్యాఖ్యాత తమ "విజ్ఞప్తి" అను శీర్షికలో గ్రంథాదిని సూచించినారు. "మేమీ ఆధారములతో గురుపరంపరను నిర్ణయించి యిందు పొందుపరచితిమి" అని వారి చివరి మాట. ఐతే యెవరిష్టము వచ్చినట్లు వారు నిర్ణయించుకొంటే యిక సంప్రదాయ మేముంటుంది? ఐనా ఆ ఆధారము లేవో, వాని ఔచిత్య మెంతవరకో యించుక విచారిస్తాము.

"అచల గురుపరంపరకు శ్రీమన్నారాయణు డాది గురువని చెప్పుచూ; ఓంనమో బ్రహ్మాదిభ్యో అని ప్రారంభించుట అనుచితముగాదా ? ఇంతకూ శ్రీమన్నారాయణు డాది గురువా ? బ్రహ్మదేవు డాది గురువా? మాది బృహద్వాశిష్ఠ సిద్ధాంతమని చెప్పుకొనుచూ, గురుపరంపరలో నా వశిష్ఠుని విస్మరించుట కృతఘ్నతగాదా ?" అని వ్యాఖ్యాత ప్రశ్నిస్తున్నారు.

ఇందుకు జవాబు : "ఓం నమో బ్రహ్మాదిభ్యో" అనగానేమి ? బ్రహ్మాదులకు నమస్కారమని అర్థముగదా! బ్రహ్మాదులన్నపుడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులైనను ఆ మాటలో చేరరా? బ్రహ్మాదులకు నమస్కారమంటే, నారాయణుడాది గురువు కాదని, బ్రహ్మయే ఆదిగురువని అన్నట్లగునా ? ఇందు ఆదిగురువు ప్రసక్తియేలేదే ! "ఓ ఆదిగురువగు బ్రహ్మ నీకు నమస్కారము" అని వ్యాఖ్యాత అర్థము తీసినారు కాబోలు. ఎంత చక్కని అర్థం తీసినారో!! సంప్రదాయక పరంపరాస్తోత్రములో, ఆ తరువాత "శ్రీ బ్రహ్మవిద్యా గురువిష్ణు, సూర్యం" అంటూ ప్రారంభించిన శ్లోకమును వీరు గమనించ లేదా ?

బృహద్వాశిష్ఠ సిద్ధాంతమనగా, వశిష్ఠుడు వ్రాసిన గ్రంథములోనిదని వీరర్థము తీసినారుకాబోలు. అట్టి గ్రంథమేదైన వశిష్ఠుడు వ్రాసినది వ్యాఖ్యాత చూచినారా ? యోగవాశిష్ఠ జ్ఞానవాశిష్ఠాది గ్రంథములలోనూ, గురుజ్ఞాన వాశిష్ఠము మొదలగు గ్రంథములలోను చేయబడిన సిద్ధాంతముల కంటె 'బృహత్' అనగా గొప్పదైన సిద్ధాంతము, అని వీరేల అర్థము గ్రహింపలేదు ? "బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో. వంశ ఋషిభ్యో. × ×" అంటూ సమష్టి దృక్పథంతో అందరికీ నమస్కార మంటూంటే, ఎవరినైనా విస్మరించినట్లు కాగలదా ? వశిష్ఠుడొక సంప్రదాయమునకు కర్తయగుచో ఆయనకు కూడా నమస్కరించినట్లే కాగలదు.

వ్యాఖ్యాత, మరిన్ని యీ క్రింది విధంగా వ్రాస్తున్నారు "కొందరచల గురుపరంపరకు శ్రీమన్నారాయణుడు సూర్యుడు, యాజ్ఞవల్క్యుడు, వరుసగా ఆది గురువులని చెప్పుచున్నారు. అది సరిగాదు. సూర్యుడు యాజ్ఞవల్క్యునికి శుక్లయజుర్వేదము బోధించినట్లు యాజ్ఞవల్క్య చరిత్ర చెప్పుచున్నది. యాజ్ఞవల్క్యుడు జనకునకు గార్గికి, మైత్రేయికి జ్ఞానమార్గమును బోధించినట్లు బృహదారణ్యకోపనిషత్తునందుగలదు. యాజ్ఞవల్క్యుడు రచించిన శతపథ బ్రాహ్మణము కర్మకాండను ప్రతిపాదించుచున్నది.

ఇంతకుమించి యాజ్ఞవల్క్య దెచ్చటను అచల పరిపూర్ణ భావమును బోధించినట్లగపడదు".

జవాబు : శ్రీమన్నారాయణుడు సూర్యునికి జ్ఞానోపదేశము చేసి నాడనుటకు "శ్లో॥ ఇమం వివస్వతేయోగం ప్రోక్తవానహమ వ్యయం ×× " అని గీతలో చెప్పబడియే యున్నది. సూర్యుడు యాజ్ఞవల్క్య నికి శుక్ల యజుర్వేదమును బోధించెను కనుక యాజ్ఞవల్క్యనికి గురువే యగును. యాజ్ఞవల్క్యుడు జనకునికి గురువని బృహదారణ్య కోపనిషత్తులో నున్నదని వ్యాఖ్యాతయే చెపుతున్నారు. అయితే "అచల పరిపూర్ణ భావమును బోధించినట్లగుపడదు" అంటారు వ్యాఖ్యాత. ఐతే శివుడు, బ్రహ్మ దేవునికి, బ్రహ్మదేవుడు వశిష్ఠునికి, వశిష్ఠుడు జనకునికి గురువులని వ్యాఖ్యాత అంటారుగదా! ఆ గురువులు ఆ శిష్యులకు అచల పరిపూర్ణ భావమును బోధించినట్లు వ్యాఖ్యాతకు యెందైనా అగు పడినదా? అగుపడదే!!! కానపుడు వ్యాఖ్యాత, వాదమెంత దుర్బలమో వేరే చెప్ప పనిలేదు. సూర్యుడు యాజ్ఞవల్క్యకి శుక్ల యజుర్వేదమును బోధించినట్లుంటే, యితర ప్రబోధ చేసియుండలేదని సిద్ధాంతీకరించుట యేనా? యాజ్ఞవల్క్య శతపథ బ్రహ్మణమును వ్రాసివుంటే పరిపూర్ణ భావమును యెరిగుండనట్లేనా ?

"జనక రాజర్షికి యాజ్ఞవల్క్య మహర్షి గురువులని కొందరభి ప్రాయపడుచున్నారు. కాని పోకల శేషాచలంగారు, జనకులకు వశిష్ఠులు గురువులని వ్రాసినారు కనుక వశిష్ఠులకు జనకులు శిష్యులని నేను వ్రాసి నాను" అని, పోకలవారి సాంప్రదాయకుడైన కంచి వెంకట్రామన్‌గారు రచించిన "మహామంత్రత్రయ భాష్యం" లో వ్రాసుకొన్నారు. కనుక, అంతకుతప్ప జనకుడు వశిష్ఠుని వలన పరిపూర్ణ భావమెరిగెననుటకు ఆధారమేమియులేదని వెంకట్రామన్‌గారి వుద్దేశము కూడా అయి వున్న దనవచ్చునుగదా!

బ్రహ్మ వశిష్ఠునికి, వశిష్టుడు జనకునకు బోధించెననుటకు వ్యాఖ్యాత యెట్టి ఆధారమున్ను చూపనేలేదు వశిష్టుడు బ్రహ్మ మానస పుత్రుడట! బ్రహ్మ మానస పుత్రులైన ఋషులింకా ఎంతమంది లేరు? అంత మాత్రమున బ్రహ్మ వశిష్టునికి గురువన జెల్లునా? వశిష్టుడు శ్రీరామచంద్రునికి అజాత సిద్ధాంతమును బోధించినట్లు బృహద్యోగవాశిష్టమునందుకలదట! అతడే (ఆవశిష్టుడే) జనకునికి కూడ బోధించెనట! జనకునికి బోధించినట్లెందున్నదో వ్యాఖ్యాత వ్రాయరు, ఆ మాట వీరి స్వంతవాక్యమే కాబోలు!

గౌడపాదాచార్యులవారు మాండూక్య కారికలలో అజాత వాదమును సిద్ధాంతంచేసిరి. అంతమాత్రమున ఆయన పరిపూర్ణబోధ గురువులున్ను ఆయన శిష్యప్రశిష్యులంతా వారివల్ల పరిపూర్ణ భావమును పొందిన వారున్నూ అగుదురా? పోకల శేషాచలంగారి పూర్వ గురువు లెవరైన యీ విధంగా పరంపర చెప్పుకొన్నారా? లేకుంటే పోకలవారిదాక క్రొత్త సాంప్రదాయము మాత్రమేగాని శివరామ దీక్షితీయ సాంప్రదాయము కాదనియే చెప్పవలసివుండును.

ఇక వ్యాఖ్యాత, పరమశివుడు బ్రహ్మ దేవునికి గురువు అని చెప్పుటకు ఆధారముగా, అనంతోపనిషత్తును వుదహరించినారు. ఆ అనంతోపనిషత్ 108 వుపనిషత్తులలో లేదనీ, మహానారాయణోపనిషత్తు అంతర్భాగము కూడ గాదనీ, పోకల శేషాచలంగారి శిష్యుని శిష్యుడగు కంచి వెంకట్రామన్‌గారు "మహామంత్ర త్రయభాష్యం తృతీయాశ్వాసములో వ్రాసియున్నారు. అట్టి అనంతోపనిషత్తును వీరు ప్రమాణంగా చూపుచున్నారు. పోనీ ఆ అనంతోపనిషత్‌లోనైనా వున్నదేమోనని పరిశీలిస్తే ఒక్క పమ్మి త్యాగరాయశెట్టిగారు. ముద్రించిన (1925 ముద్రణ) దానిలో మాత్రమే వున్నది. శ్రీ సచ్చిదానంద పగడాల వెంకటేశ్వరావధూతగారి స్వదస్తూరీలోనున్న గ్రంథంలోగాని రాజాపేట వ్రాతప్రతిలో గాని శికింద్రాబాద్‌నుండి చిరకాలముగా వెలువడుచూయున్న "అనుష్టాన

యీ సంప్రదాయ మనుసరించనివారు శివరామ దీక్షిత పరంపరలోని వారు కారని చెప్పకతప్పదు.

బ్రహ్మ విద్యా సాంప్రదాయికములకు అన్నిటికి పరమశివుడు ప్రధమ గురువనుటలో సందేహములేదు. ఆతడే దక్షిణామూర్తిగా అవతరించి లోక గురువుగా పరిగణింపబడుచున్నాడు శివరామదీక్షిత సాంప్రదాయక గురుపరంపరలో ఆయనను "శ్రీ బ్రహ్మ విద్యాగురు" వని "శ్రీ బ్రహ్మ విద్యా గురు, విష్ణు, సూర్యం, శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకంచ × × ×" అంటూ శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులు గురు పరంపరలో పేర్కొన్నారు. 2వ గురువు శ్రీ మహావిష్ణువని ఆ కృష్ణ దేశికులు పేర్కొన్నారు. ఆయన వ్రాసిన కందార్థములు పూజనీయముగా ఆమోదించి, వానికి భావార్థదీపిక, అను వ్యాఖ్యానము చేయబూనినారు యీ వ్యాఖ్యాత. కృష్ణదేశికులవారి శివరామ దీక్షితీయ సంప్రదాయమూ, ఆ సంప్రదాయకుల కందార్థ గ్రంధమూ అంగీకరిస్తూ, వారు చెప్పుకొని వ్రాసిన గురు పరంపరా స్తోత్రమును మాత్రము అంగీకరించరట యీ వ్యాఖ్యాత! ఏమి విడ్డూరము? ఆ కృష్ణదేశికేంద్రులవారే గురు పూజావిధానము వ్రాసినారు. దానికి పూర్వాంగముగా గురుపరంపరా స్తోత్రము వ్రాసినారు ఇది శ్రీ మహావిష్ణు సాంప్రదాయమని స్పష్టముగా పేర్కొన్నారు. యీ విషయములు పాపము వ్యాఖ్యాత కేమియు తెలియవు కాబోలు. పూర్వాపరములు తెలియకనే, తెలుసుకొని యున్నవారి వద్ద తెలుసుకొనకనే, కృష్ణదేశికేంద్రులవారు రచించిన గురుపరంపర సరియయినది కాదని ఆక్షేపించుట యెంత సాహసము? అందుకు ఆధారములు, ప్రమాణములు కొరకు వెతకులాడుట అవివేకం. ఏలననగా సంప్రదాయమను మాటకు అర్థమేమి? పరంపరాగతముగా చెప్పుకొనబడుచూ లేక ఆచరణయందుంచబడి అభ్యసింపబడుచూ నున్న దేదో అది సంప్రదాయమనబడును గదా! కనుక సంప్రదాయములకు ప్రమాణములు కొరకు వెతుకబూనుట, నిష్ప్రయోజనమని తెలియవలెను.

"మేమీ ఆధారములతో గురుపరంపరను నిర్ణయించి యిందు పొందు పరచితిమి. పాఠకులిందరి యుక్తాయుక్తములనరసి తెలిసికొందురు గాక !" అని వారి విజ్ఞప్తిలో చివరి మాటలు, వ్యాఖ్యాత శివరామ దీక్షిత గురుపరంపరను తనకు తోచిన రీతిని సవరించి నిర్ణయించ బూనుట అయుక్తము అనుచితము. సంప్రదాయకులు పరంపరానుగతముగా చెప్పుకొనుచున్న పరంపర సరిగాదని యనుటకు దానిని సవరింప పూనుకొనుటకు వీరి కధికారమెవరిచ్చిరి ?

వీరెట్టి అధికారులో యించుక విచారించవలె వీరి పూర్వ గురు పరంపర వ్రాస్తున్నాము. పోతులూరి వీరబ్రహ్మంగారు, దూదేకుల సిద్ధప్ప, జంగమమురలింగం, శేషరాజు, చెంచురాజు ఈ చెంచురాజు కిద్దరు శిష్యులు అవనిగడ్డ కోటప్పదేవర, పోకల శేషాచలంగారు అచల గురుపరంపర వీరు వ్రాసుకొన్న దెట్లనగా శివరామ దీక్షితులు, రామకృష్ణయ్య మహేశ్వర్లు, కోటప్పదేవర, పోకల శేషాచలంగారు, పోలకం నర్శింహశెట్టి, కుప్పం రంగయ్య, కడియాల వెంకటరత్నం (= యీ వ్యాఖ్యాత) ఈ వ్యాఖ్యాతకు సన్యాసమిచ్చిన గురువులెవరో ? దశవిధ నామములుగల సన్యాస సంప్రదాయములలో 'గిరి' అనే సంప్రదాయమునకు చెందియుండవచ్చునని బ్రహ్మానందగిరి అనే పేరు సూచిస్తూ యున్నది. కుప్పం రంగయ్యగారివద్ద వుపదేశం పొందుసరికి వ్యాఖ్యాత గృహస్థులే. వీరికి తమ గురుబోధవలన భ్రాంతి రహితమైవుంటే సన్యాసమేల తీసుకొనిరి ? భ్రాంతి రహితం కాలేదనక తప్పదు. భ్రాంతి రహితంగాక పోవుటచేతనే, సన్యాసాశ్రమ స్వీకారం చేస్తే, భ్రాంతి రహితం కాగలదను భ్రాంతితో సన్యాస దీక్ష గైకొన్నారు శాస్త్ర వాసనతో వుత్తరాది దేశములకేగి శాస్త్రాధ్యయనం చేసినారు. అద్వైత సాంప్రదాయకమునందే అభిమానం కల్గి నిన్న మొన్నటి వరకు ప్రబోధ ప్రచారములుగావించినారు. తగుదునమ్మా యని నేడు పూర్ణబోధ గురువు నని బైలుదేరి శిష్యసేకరణ గావించుచూ ప్రచారం చేసుకొంటున్నారు.

మాటిమాటికీ కోటుమార్చి పార్టీ ఫిరాయించే రాజకీయ వేత్తలవలె వున్నదీ తంతు ఆదిలో వీరబ్రహ్మంగారి యోగసాంప్రదాయం. పిదప అచల బోధ సాంప్రదాయకము ! పిమ్మట అద్వైత సాంప్రదాయక సన్యాస సంప్రదాయకం, ఆపైన తిర్గి అచలబోధ సంప్రదాయకం దేనియందూ, యీ సాంప్రదాయకులకు నిలకడయున్నట్లు తోచుటలేదు. ఇప్పుడీ వ్యాఖ్యాత సన్యాస దీక్షకు స్వస్తిచెప్పినారా యేమి ? ఏమో ? వారి అంతః కరణకే తెలియవలెను. కాషాయ వేషధారణ మాత్రం మారలేదేమో !

## పోకలవారి సాంప్రదాయక సిద్ధాంత మేది ?

పోకల శేషాచలంగారి పూర్వ గురువులందరూ పోతులూరి వీర బ్రహ్మంగారి శిష్యపరంపరలోవారే. సిద్దప్ప, అమరలింగదేశికులు, శేషరాజు, చెంచురాజుగార్లు శుద్ధంగా, వీరబ్రహ్మంగారి సిద్ధాంతమునే అనుసరించిరి. తాత్వికంగా చూస్తే, వీరబ్రహ్మంగారి సిద్ధాంతము అద్వైత సిద్ధాంతమే. అద్వైతసిద్ధికి సాధనామార్గంగా వారు సోఽహంభావము నందును, యోగసాధనయందునూ కృషిచేయుచుండిరి. పైన వుదహ రించిన చెంచురాజుకు అవనిగడ్డ కోటప్పదేవరయు, పోకల శేషాచలం గారున్ను శిష్యులై ఆయామార్గములందు కృషిసల్పుచుండిరి యిట్లుండగా అవనిగడ్డ కోటప్పదేవర పరిపూర్ణబోధ సాంప్రదాయకుడైన మహేశ్వర గురునివద్ద పరిపూర్ణబోధ తెలుసుకొనెనట. అట్లు తెలుసుకొని తనకు వీర బ్రహ్మంగారి సాంప్రదాయకంలో సోదరుడగు పోకలశేషాచలంగారిక్కి తాను గ్రహించిన పూర్ణబోధ తెల్పెనట కోటప్పదేవర, శేషాచలంగార్లు క్రొత్తగా పూర్ణభావమునందు గ్రహించిన విషయము ఏది ? అది శుద్ధ మైన పరిపూర్ణబోధకాదు. ఆర్యాదర్పణ విధానములో గ్రహించినదే మెరుక యొక్క స్థానస్వరూపములని భ్రాంతిచెంది ఆ మెరుక కన్య మైనదే పరిపూర్ణబ్రహ్మమని వారి సిద్ధాంతముగా నుండెను. కనుక సృష్టికి

పూర్వము, సృష్టికారణముగానున్న, నిర్గుణ పరబ్రహ్మమే పరిపూర్ణమని ఆబ్రహ్మము ఆదిలో వీరబ్రహ్మంగారి సాంప్రదాయక ప్రబోధమునందు తాము గ్రహించిన బ్రహ్మముకంటె భిన్నముకాదని వీరపోహచెందిరి. అందుచేతనే వీరు బ్రహ్మంగారి సాంప్రదాయక పరంపరను విడువలేక నేటికిని ఆ పరంపరా గురుస్తోత్రము చేయుచున్నారు. అదనంగా తమకు పరిపూర్ణబోధ అనుగ్రహించిన మహేశ్వర గురునియొక్క గురుపరంపరను కూడ స్మరించుచున్నారు

పోకల శేషాచలంగారు శివరామదీక్షితీయమను బృహద్వాశిష్ఠము భాగవతుల కృష్ణదాసుగారి కందార్థములను ప్రమాణములుగా గ్రహించుచూ సోహంభావము, ఆర్యదర్పణములు విడువక శిష్యులకు బోధించుచూ ఒక కలగూరగంప వేదాంతమునకు మూలపురుషుడుగా నుండుటచే వీరి వేదాంతము పోకలవారి సాంప్రదాయకమని చెప్పబడుచున్నది. ఇది శుద్ధమైన శివరామదీక్షిత సిద్ధాంతమూగాక బ్రహ్మంగారి అద్వైత యోగ మార్గములూగాక ఒక సంకరవేదాంతమై యున్నది.

శ్రీ బ్రహ్మనందగిరిగారి చరిత్రగూడ యిందుకనుగుణ్యముగానే యున్నది ఆదిలో కుప్పం లింగయ్యగారివద్ద పూర్ణబోధ అంటూ బోధ పొందుట, సన్యసించుట, అద్వైతగురువై అద్వైత ప్రతిపాదక గ్రంధములు, వానికి వ్యాఖ్యానములు వ్రాయుట, నేడు మరల పూర్ణబోధ గురువుగా శిష్యులనుచేర్చి ప్రబోధచేయుటయేగాక కృష్ణదాసుగారి కందార్థములకు వ్యాఖ్యానములు వ్రాయుట చూడగా వీరు అద్వైత పరిపూర్ణ భావముల కేమియు భేదములేదని యెంచి కృషిచేయుచున్నాడనుట సుస్పష్టము

ఇదీ వ్యాఖ్యాతకుగల అధికారము. ఈ అధికారముతో వీరు నేడు శివరామదీక్షిత సంప్రదాయక గురుపరంపరను మార్పుచేసినారు.

పోకలవారు నిజంగా దీక్షిత పరంపరలోవారే అయితే వారివల్ల వూర్ణబోధను వున్నదున్నట్లుగా గ్రహించియే యుంటే, భాగవతుల కృష్ణ దేశికేంద్రులవారి కందార్థ భావములను చక్కగా యెందుకు అర్థం చేసుకొనలేకపోయిరి ? అర్థం చేసుకొనియేయుంటే సిద్ధాంత వ్యతిరేకమగు సవరణలుచేసి కందార్థములను యెందు కస్తవ్యస్తం చేసిరి ? యితర కందార్థములను క్రొత్తగా యెందుకు చేర్చిరి ? పోకల నర్సింహారావు గారితో శ్రీ దయానంద పౌన్నాల రాజయోగిగారి చర్చల అనంతరం, వేసిన (పంచమ ముద్రణ) కందార్థములలో యేల మార్పులు చేసిరి ? తమ మూలపురుషులలో నొకరగు పోకల శేషాచలంగారు వ్యాఖ్యాన సహితంగా 1934 లో కందార్థముల ముద్రించి యుండగా, 1972 లో మరల యీ వ్యాఖ్యాత యీ భావార్థ దీపికా గ్రంథమునేల అచ్చువేయించ వలసివచ్చెను ? మాటిమాటికీ మార్పులు చెందే వీరినిర్ణయములను హర్షింప వచ్చునా ? ఇది అంతయూ చూడగా యీ పోకలవారి సాంప్రదాయకులు నిజసాంప్రదాయక బోధవిధానము తెలుసుకొనకనే, యిదమిత్థమను యెట్టి నిర్ణయములేకనే, చీకటిలో చిందులాడుచూ తమ యిచ్ఛవచ్చినట్లు ఎవరికి వారే మార్పులు చేసుకొంటూ వస్తున్నారని సుస్పష్టమే. యిదంతా మేము కూడ శివరామదీక్షిత పీఠస్థులమేనని లోకంబును నమ్మించి, కీర్తి ధన ప్రతిష్ఠలకై ప్రాకులాడు పద్ధతిగానున్నది. నిజ గురుపరంపరను యిట్టి అసంప్రదాయకులు సవరింపబూనుటెంత హాస్యాస్పదము !!! వ్యాఖ్యాత, గ్రంథాదిని ముద్రించిన పరంపరయుక్తమా ? అయుక్తమా ? అను విషయం వ్యాఖ్యాత పాఠకులకు వదలి వేసినారు. అయుక్తమని వ్రాసి పుచ్చుటయే కర్తవ్యం.

*III బృహద్వాశిష్ఠ రచయిత వశిష్ఠుడా ?*

వశిష్ఠుడే బృహద్వాశిష్ఠ గ్రంథకర్తయని వ్యాఖ్యాత (బ్రహ్మానందగిరి) భావించుచున్నట్లు "విజ్ఞప్తి" లోని వారి వాక్యాలు సూచిస్తు

న్నాయి. "బృహద్వాశిష్ఠమను" పేరు గ్రంథకర్త నామమును సూచించదు. అది వశిష్ఠప్రోక్తమని భావించుట కెట్టి ఆధారమును లేదు. బృహద్వాశిష్ఠ సిద్ధాంతము మచ్చుకైనా వశిష్ఠ ప్రోక్తములగు యితర గ్రంథము ఎచ్చటా గానరాదు

బృహద్వాశిష్ఠమను గ్రంథము యొక్క పూర్తిపేరు శ్రీ శివరామ దీక్షితీయమను బృహద్వాశిష్ఠము. ఈ పేరు చూచుట తోడనే అది శ్రీ శివరామ దీక్షితులు రచించినదని స్పష్టమేకదా! యీ వ్యాఖ్యాత ఆ గ్రంథమునే చూచియుండరనుట స్పష్టమే శ్రీ శివరామ దీక్షితులు రచించిన గ్రంథముల పేరైన నెరుగని వారు శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయకులమని చెప్పుకొనుట కర్హతయున్నదా? వశిష్ట ప్రోక్తములగు గ్రంథములలో అద్వైత సిద్ధాంతము తారకస్థాయి చేరుకున్నది ఆ సిద్ధాంతమునకంటె అతీతమైన సిద్ధాంతమగుటచే ఆ సిద్ధాంత గ్రంథమునకు బృహద్వాశిష్టమనిన్ని ఆ సిద్ధాంతమునకు బృహద్వాశిష్ట సిద్ధాంతమనిన్ని పేరు వచ్చెనని తెలియవలెను.

IV వ్యాఖ్యాత వ్రాసుకొన్న "ముందుమాట" :—

ఆ ముందు మాటలో (1) కందార్థముల భాషను కొందరు మార్పు చేసిరి. (2) కొందరు భిన్న భావములను ప్రవేశపెట్టిరి (3) కొందరచ్చటచ్చట కొన్ని పదములను తీసివేసి కొత్తపదములను చేర్చిరి. (4) కొందరు నూతన కందార్థములను సృష్టించి గ్రంథంలో చేర్చిరి. కనుక గ్రంథకర్త అభిప్రాయమును తెలుసుకొనుట కష్టముగానుండెనన్నారు వ్యాఖ్యాత. తమకంత కష్టముగానుంటే (అపుడు అనగా 1920, 1925 మధ్య) తమ గురువులు, గురువుల గురువులు; వారి గురువులు ఏమైరి? వాటచ్చొత్తించిన కందార్థాలు ఏమయ్యేను?

పోకల శేషాచలంగారూ, వారి కుమారుడు (శిష్యుడూ కూడ) వెంకటనర్సింహరావుగారూ అచ్చొత్తించిన కందార్థాలు, వానికి వారు

వ్రాసిన వ్యాఖ్యానాలు యీ వాఖ్యాతకు తప్పుడు తరకలుగా కనపడి తృప్తినీయలేదు కాబోలు! కృష్ణదేశికుల శిష్యులైన పీల్కానా లక్ష్మణరావు, శంకర్రావుగార్ల వద్దనున్న వ్రాత ప్రతిననుసరించి 1886 లోనే అచ్చు వేయబడిన కందార్థ గ్రంధ ముండెనుగదా ? దాని విషయమే వ్యాఖ్యాతకు తెలియదు కాబోలు. కృష్ణదాసుగారి శిష్యులైన ఆదిరాజు తిరుమల రావుగారితో వ్యాఖ్యాతకు సన్నిహిత పరిచయ ముండెనట, వారి వ్రాత ప్రతినుంచి వ్యాఖ్యాత కాపీ వ్రాసికొనెనట. 50 సం॥ముల అనంతరం యిపుడీ భావార్థదీపిక వ్రాసి ప్రకటించెనట. యిదీ వ్యాఖ్యాత వ్రాసిన కధ. యీ కధ ఏమంత నమ్మదగినదిగాలేదు. కారణములు :—

(1) వ్యాఖ్యాత దేయూరు ? తిరుమలరావుగారి దేయూరు ? వారి వయస్సెంత ? వీరి వయస్సెంత ? తిరుమలరావుగారు శికింద్రాబాద్ బోలారంలో వుండేవారు 1925లో కాలము చేసిరి. అప్పటికి వ్యాఖ్యాత వయస్సు 23 సం॥లు మాత్రమే.

(2) శుద్ధ ప్రతిని కాపీచేసుకొనివుంటే అది 1925 కు పూర్వమే వ్రాసుకొని వుండాలి. అప్పుడు ప్రతులను ముద్రించిన పోకలవారికీ శుద్ధ ప్రతిని వ్యాఖ్యాత ఏల చూపలేదు ? చూపివుంటే, వారేల దర్మిలాను మరల మరల తప్పుడు ప్రతులనే అచ్చు వేయింతురు ? చూపకపోవుటకు కారణమేమి ?

(3) శుద్ధప్రతి తనవద్దవుంటే రమారమీ 50 సంవత్సరాలు దానిని ముద్రించక వూరుకొని యిపుడు ముద్రించుటకు కారణమేమి ?

(4) 1886 నుంచీ యిప్పటి వరకు శికింద్రాబాద్ పీఠంవారు అచ్చువేయిస్తూవచ్చిన కందార్థములకున్ను యిపుడు వ్యాఖ్యాత ముద్రించిన కందార్థాలకున్ను ముఖ్యమగు తేడాలేమైనయున్నవా ? అంత తేడాలు లేకుంటే వ్యాఖ్యాత యీ ముద్రణ నేల చేయించవలెను ? తాను వ్రాసిన వ్యాఖ్యానము (భావార్థ దీపిక) ప్రకటించుకొనుటకై యీ కందార్థములను

కూడా ముద్రించితినని చెప్పుకోరాదా ? యీ డొంక తిరుగుడు కధలల్లుట యెందుకు ?

(5) యీ వ్యాఖ్యానమునకు మాత్రమేమి అవసరము కల్గినది ? శేషాచలంగారు వ్రాసిన వ్యాఖ్యానము ఆయన కుమారునికి నచ్చక వారొక వ్యాఖ్యానము చేసిరి ఆ యిద్దరి వ్యాఖ్యానములు నచ్చక యీ వ్యాఖ్యాత మరొక కొత్త వ్యాఖ్యానము వ్రాసెను కాబోలు ! లేక వారికంటె తనకు అధిక్యత కలదని నిరూపించుటకా ? వ్యాఖ్యాతకే తెలియవలెను.

(6) కందార్ధముల పూర్తి పేరు "శక్తిద్వయ నిరాసకంబైన, శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధదరువులు". తిరుమలరావుగారి వ్రాతప్రతిలో "శక్తి ద్వయ నిరాసకంబైన" అని యుండదా ? యీ అన్ని కారణములచే వ్యాఖ్యాత వ్రాసిన దొక కధ మాత్రమని అనుకోవలసి వస్తోంది

ఆదిలో వ్యాఖ్యాత పూర్ణబోధలో ప్రవేశించెనట ! శూద్రులకు కాషాయధారణ కూడదని లోకులంటున్నారని, తాను సన్యసించి కాషాయం ధరించెనట. తీర్ధయాత్రలు చేసెనట, ఉత్తరాదిని కొన్ని అద్వైత వేదాంత ప్రకరణ గ్రంథములు వుపనిషత్తులు శ్రవణంచేసి తిరిగివచ్చి అద్వైత గురువై శిష్యులకు పాఠాలు చెపుతూ, స్త్రీ పురుషులను శిష్యులను చేసికొని కొన్ని ఆశ్రమములు నిర్మించెనట, కొన్ని గ్రంథములు రచించెనట. రజోగుణ సంబంధమగు చంచలత్వముతో యిన్నిచేసినా అటు సన్యాసులలోగాని యిటు శాస్త్రవేత్తలలోగాని తగు స్థానము సంపాదించలేక పోయెను. ఇపుడు పూర్ణబోధ గురువులలో నొక స్థానము సంపాదించవలెనని కాబోలు, శిష్య సేకరణ చేస్తూ యీవ్యాఖ్య ప్రకటించారు.

అంతటితో నాగకుండా ప్రచారములోనున్న శ్రీ శివరామదీక్షిత గురుపరంపర సరియైనది కాదంటూ ఒక విప్లవాత్మక భావాన్ని ప్రచారం

చేస్తూ ఒక నూతన పరంపరను లోకాని కనుగ్రహిస్తున్నారు. చవుకగా లోకుల నోళ్ళలో బడుట కిదేభేషైన మార్గమనుకొన్నారు కాబోలు వ్యాఖ్యాత ! ఏమైతేనేం, పేరు రావాలి. అహో ! కీర్తి ప్రతిష్ఠల వ్యామోహ మెంతటిదో కదా !!!

V మూల గ్రంథమును కలుషిత మొనర్చిన వారెవరు ?

1886 సంవత్సరమునకు పూర్వం సాంప్రదాయక పెద్దలవద్ద శుద్ధప్రతిని సంపాదించకనే. అక్కడక్కడ ఆనోటా ఈనోటా కందార్థములు వింటూ, ఎక్కడేనా యెవరైనా వ్రాసుకొని వుండిన కందార్థములను వ్రాసుకొని విచక్షణా రహితంగా వానినన్నిటిని ముద్రించిన దోషం పూర్తిగా పోకలవారిదే - పరిపూర్ణబోధ సిద్ధాంత సూత్రములకు సరిపోవునాయని యోచించనైనా లేదువారు. లేక, ఆ సిద్ధాంతంవారికి సరిగా అవగాహనే కాలేదో ? అవగాహనయైవుంటే, యితరులు వ్రాసిన చెత్త కందార్థాలు (సిద్ధాంతానికి సరిపోనివి) కూడా కలిపి అచ్చువేస్తారా ? అంతేకాదు. అవి కూడా కృష్ణదేశికులు వ్రాసినవేనని పోకల వెంకటనర్సింహారావుగారు సమర్థింప యత్నిస్తారా ? ఆ గ్రంధాలు సాంప్రదాయకులైనవారు అచ్చువేయించిరని సాంప్రదాయకులెవరున్నూ అనుకోజాలరు, మూల గ్రంథమును కలుషిత మొనర్చిన దోషం పూర్తిగా పోకలవారిదేననక తప్పదు. తమ మూలపురుషులే యీ నేరమునకు బాధ్యులని యెరింగి యుందియు, యెవరెవరో యేవేవో మార్పులు చేర్పులు చేసినారని ఆ నేరమును అన్యులపైకి దొర్లించడానికి ప్రయత్నిస్తున్నారీ వ్యాఖ్యాత.

కందార్థాలలో పోకలవారు చేస్తూ వచ్చిన ముఖ్యమగు మార్పులు వ్రాసిన వ్యాఖ్యానాలు, ప్రస్తుత భావార్థ దీపికా వ్యాఖ్య యీ మొదలగు విషయములు క్రమంగా యీ పత్రికా ముఖంగా, సవిమర్శకంగా ప్రకటింపబడును.

పోకలవారు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకులగుదురా ?

(1) పోకల వెంకటనర్సింహారావుగారి శిష్యుడైన కంచి వెంకట రామన్‌గారు 1950 లో ప్రకటించిన మహామంత్రత్రయ భాష్యమను గ్రంథంలో గురుపరంపరాభివర్ణనము గావిస్తూ, అల్లమా ప్రభువు కృప చేతనో, మహాదేవి కృపచేతనో, పూర్ణ భావమును గ్రహించి శివుడు ప్రథమ గురువయ్యెనని, శివునికి విష్ణుదేవుడు, విష్ణుదేవుని కృపచే బ్రహ్మదేవుడును, బ్రహ్మ దేవునికి వశిష్టుడును, వశిష్టునికి జనకుడును, పరంపరాగా శిష్యులైనట్లు వ్రాసిరి. నిన్నమొన్నటి అల్లమా ప్రభువు పరమ శివునికే గురువగుట మహావిడ్డూరము దీనికే యాధారములు చెపుతారో ఎవరికెరుక ?

(2) ఏది ఎట్లున్నా, కంచి వెంకట రామన్‌గారు పరమ శివునికి శ్రీ మహావిష్ణువు శిష్యుడని స్పష్టంగా చెప్పియుండగా, పరమ శివుడు నేరుగా బ్రహ్మకే వుపదేశించెనని అనంతోపనిషత్తును ప్రమాణంగా పేర్కొని శ్రీమహావిష్ణు సంప్రదాయం సరి అయినది కాదని యీ వ్యాఖ్యాత సాధించ బూనుట, కేవలం గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించి నట్లున్నది.

(3) ఇప్పటికైననూ యీ వ్యాఖ్యాతగాని, వీరి గురువులుగాని, వీరి శిష్యులుగాని, యితమిత్థమని ఒక గురుపరంపరకు కట్టుబడి యున్నట్లు తోచదు ప్రతి గ్రంథంలోను పోతులూరి వీరబ్రహ్మంగారి పరంపరను చెప్పుకొనుట మానలేదు. ఈ వ్యాఖ్యాత రచించిన భావార్థ దీపికా గ్రంథాంతమున రెండు గురుపరంపరా మంగళహారతులు ప్రచు రించినారు. ఆ రెంటిలోనూ ఒకటి అద్వైత గురుపరంపరా మంగళ హారతి రెండవది అచల గురుపరంపరా మంగళహారతి ఆ రెంటిలోనూ వ్యాఖ్యాత పేరూ వ్యాఖ్యాత గురువుల పేర్లూ వున్నవి. కనుక ఇపుడు వీరిని అద్వైత సాంప్రదాయకులనవలెనా ? లేక అచల గురుసంప్ర

దాయకులనవలెనా ? లేక కలగూరగంప సాంప్రదాయకులవలెనా ? వీరు నిత్యమూ గురుపరంపరా స్తోత్రము పఠించుకోడం వుందోలేదో తెలియదు గాని, వుంటే ఏ పరంపర పఠిస్తారు ? బహుశా రెండూ పఠించుకొంటారేమో !

(4) ఈ పోకలవారి సాంప్రదాయకులు, అద్వైత, పరిపూర్ణ భావములు రెండూ ఒకటేననే భావంలో వున్నారని అనక తప్పదు. యీ వ్యాఖ్యాతకు పరమ గురువులైన పోలకం నరశింహశెట్టిగారు 1927 లో ప్రకటించిన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం చూస్తే యీ విషయం సుస్పష్టమవుచున్నది. ఉదాహరణకు ఆ గ్రంధం పంచమాధ్యాయంలో - 177-ఆ॥ వె॥ నెలత వినుమ యింక నీస్వస్వరూపంబు. బట్టబయలుగాని భ్రాంతిచేత, వెలయదోచుచుండు విశ్వరూపంబైన, మాయ నీవుగావు మధురవాణీ॥ 178 పరిపూర్ణంబేనేనని, యెరిగియు నీ దేహమాత్మ; యే గాననుచు౯ పరికింపుము నీ కన్యము. మరియేమియు లేదఖిలము మాయ దలంపన్॥ 179-ఆ॥ వె॥ భ్రాంతిలేని బట్టబయలైన నీకును, ప్రాణ మరయలేదు బ్రతుకులేదు, బ్రతుకులేని నీకు పరగచావును లేదు, చావులేని నీకు జన్మలేదు. 182-కం॥ ఏమియుగాకను బయలును, నేమియు ననరాకయుండు నీ యందెపుడున్ ఏమేమి పుట్టుచున్నదో, యేమేమియు నాశమౌనొ యెరుగవు నీవున్॥ 183-ఆ॥ వె॥ ఎరుక నేనంచు నెన్నకు, మెరుకచే । నెరిగెరుగు కేవలాత్మయే యటంచు । నెరుగు నెరుక నాకు గురుదక్షిణగ నిప్పు । డిమ్ము తడవులేక యిందువదన॥ అనియు 133 పేజీలోని దండకంలో "నా స్వస్వరూపంబు పూర్ణాచలం బౌటనేగంటి" నని౯్ని వ్రాసినారు. ఇందు మొదటి పద్యంలో - (1) నీ స్వరూపమే బట్టబయలు, నీవు మాయవుగావన్నారు. 2వ పద్యంలో "పరిపూర్ణమే నేను- యీ దేహ మాత్మ కనుక అది నేనుగాను" అన్నారు. 3వ పద్యంలో "బట్టబయలైన నీకు ప్రాణంలేదు, బ్రతుకులేదు, చావులేదు, జన్మలేదు" అన్నారు. 4వ పద్యంలో "ఏమియు కాకుండా,

ఏమియు ననరాకుండాయున్న నీ యందు ఏమేమి పుట్టి చస్తుందో నీకు తెలియదు" అన్నారు 5వ పద్యంలో నేను యెరుకను అని అనబోకుము యెరుకచే తెలియబడే కేవలాత్మవు నీవు, ఎరుకను నాకు గురుదక్షిణగా యిచ్చివేయుము అన్నారు. ఇక దండకంలో నా స్వస్వరూపమే బట్ట బయలని నేను తెలుసుకొంటినన్నారు. సచ్చిదానందములు ఆత్మకు స్వరూపలక్షణమని అద్వైత నిర్ణయం అద్వైత వాదమునకే సరిపోతాయి గాని పరిపూర్ణబోధకు "మహావాక్యార్థతోదూరః" అన్నట్లు యెంత దూరస్తములై యున్నవో పరిపూర్ణ భావజ్ఞులకే తెలుస్తాయిగాని, అసంప్ర దాయకుల కేమి తెలుస్తాయి పాపం !!! పరిపూర్ణ పరబ్రహ్మమును, సచ్చిదానంద రూపమగు లేదా సచ్చిదానంద రూపాత్మసాక్షియగు యెరు కయు నొకటియేగాని, వేరుగావని వీరు భావించినట్లు సుస్పష్టమే "అది యిదిగాదు; యిది అదిగాదు" అనే శ్రీ శివరామ దీక్షితీయ సిద్ధాంతమునకీ వ్రాతలు యెంత విరుద్ధములో వేరుగా చెప్పవలసిన పనిలేదు వీరు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకులష !!!

(5) శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు రచించిన గ్రంథము పేరు "శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ దరువులు" అయివుండగా ఆ గ్రంథమును ముద్రించిన పోకలవారూ యీ వ్యాఖ్యాతా, "శక్తి ద్వయ నిరాసకంబైన" అను మాటలు గ్రంధనామమునుండి తొలగించి "శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధ దరువులు" అని మాత్రమే పేరు పెట్టుటకు కారణమేమి ? గ్రంథము యొక్క పేరే తెలియకనా ? పొర పాటు వలననా ? అర్థం కాకనా ? లేక అద్వైతానికి ఆ పేరుంటే సరిపోదనియా ? ఏమో ! వారే చెప్పవలసి వుంటుంది. శక్తిద్వయము యెరుక లోనిదా ? యెరుక మీరినదా ? యెరుక లేనిది పరిపూర్ణ పర బ్రహ్మ మంటారుగదా ! ఎరుకను నిరసించుటకై చెప్పిన కందార్థాలకు "శక్తిద్వయ నిరాసకంబైన" అను మాటలుండుటయే శ్రేష్ఠముగదా ! ఆ మాటలను వీరేల తొలగించిరి ? శేషాచలంగారూ, వారి కుమారుడు

వెంకట నర్సింహారావుగారూ ఆ గ్రంథ నామము పూర్తిగా తెలుసుకోక వదలి వేసినారేమో అనికోవచ్చునుగాని, ఆదిరాజు తిరుమలరావుగారివద్ద శుద్ధ ప్రతిని చూచి కాపీ వ్రాసుకొన్న యీ వ్యాఖ్యాత కూడా ఆ మాటలను యెందుకు వదలివేయాలి? అద్వైత నిర్మితమైన యెరుక బ్రహ్మమున్నూ పరిపూర్ణ పరబ్రహ్మమున్నూ ఒకటియేగాని వేరుగావని వీరు అభిప్రాయపడియుండుటచే. ఎరుక బ్రహ్మమును నిరసించుట కిష్టంలేక, "శక్తిద్వయ నిరాసకంబైన" అను మాటలను తొలగించి యుందురని అనుకోవలసివస్తోంది.

(6) ఇంతకూ యీ విచిత్ర సాంప్రదాయకమునకు చెందిన పోకల వారు చేసిన వ్యాఖ్యానములు యీ భావార్థ దీపికా వ్యాఖ్య, మూల సిద్ధాంతమునకు యెంత దూరస్తములై యుండునో వేరుగా చెప్పనక్కర లేదు. ఈ వ్యాఖ్యాత ప్రకటించిన గ్రంథము యొక్క బహిరంగ పరీక్ష వల్లనే యీ విషయములు తేటతెల్లమగుచున్నవి. ఇక అంతరంగ పరీక్షలో తెల్లమగు విషయములు యీ పత్రికా ముఖముగా మున్ముందు ప్రకటించగలము.

శ్రీ మద్భాగవతుల శ్రీ కృష్ణదేశికేంద్రులవారు రచించిన శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ దరువులను, క్షరా క్షరోపాధి ద్వయదోష రహిత పరమతత్వ కంద పద్యములను చదువు టకు, విచారించి చెప్పుటకు లేదా, వ్యాఖ్యానము వ్రాయుటకు వినుటకు అధికారులెవరు? ఈ భావార్థదీపికా వ్యాఖ్యానము రచించిన యీ వ్యాఖ్యాత (శ్రీ బ్రహ్మానందగిరి) కట్టి యధికారమున్నదా? ముందుగా విచారిస్తున్నాము.

"పరిపూర్ణ మొకటి, లేనెరుకానెదొకటి పరిపూర్ణ మెరుకల నెఱిగి యెరుకను మాను" టయే పూర్ణబోద సిద్ధాంతమని మూలగ్రంథ రచయిత శ్రీ కృష్ణదేశికేంద్రుల నిర్ణయము. పరిపూర్ణ మెరుకల నెరుగుట యనగా

నేమి ? పరిపూర్ణమును, యెరుకను, వస్తు నిశ్చయ పూర్వకముగా గురుముఖతః తెలిసికొనుటయే "యెరుగుట" యగునుగాని, వానిని గురించి చదువుట, వినుట, లేక యూహించుట మాత్రమే కాదని వేరే చెప్పనవసరము లేదు. అట్లా పరిపూర్ణ మెరుకల రెంటినీ యెరిగిన వాడే కందార్థబోధ వినుట కధికారి. ఆ పిదప యెరుకను విడచి అశరీర పద్ధతిలో నుండువాడే పరిపూర్ణ బోధలో ఆరూఢుడని చెప్పదగినవాడు. అట్టివాడే పరిపూర్ణబోధ గురువగుటకు, యితరులకు బోధించుటకు, లేదా వ్రాయవలసివస్తే వ్రాయుటకు అర్హుడు కాని, యెరుక నిర్ణయమే వస్తు నిశ్చయంగా యెరుగనివాడు, పరిపూర్ణబోధచెప్పు గురువుగా నుండుటకే అర్హతలేదు. అట్టివాని గురించియే వేమన్నగారు "తన్నుతా నెరుగడు తానెవ్వనికి జెప్పు పాలుమాలినట్టి పశువు కొడుకు" అంటూ నిశితంగా దూషించినారు కనుక పరిపూర్ణమును, యెరుకను (తన్ను) యెరిగి, యెరుకను విడచు టెట్లో యెరిగిన గురువుల వద్దనే (పరిపూర్ణ బోధ వున్న దున్నట్లు గ్రహించిన పిదప) కందార్థ గ్రంధము అదవరకు విన్న పరిపూర్ణ బోధదార్ఢ్యము కొరకు శిష్యులు శ్రవణం చేయదగిన యుత్కృష్ట గ్రంధమైయున్నది. అట్లు విన్నపుడు మాత్రమే శిష్యుడు తన సర్వసంశయ నివృత్తి గావించు కొనుటకు సావుకాశమేర్పడును. శిష్యుల సంశయ నివృత్తి గావించుట కీ కందార్ధ గ్రంధస్థ విషయము లెంతో గురునికి తోడ్పడును. ఇట్టి ఆదర్శ గురు శిష్యుల మధ్య మాత్రమే కందార్ధ విచారణ జరుగవలసివుండును శిష్యుని అర్హత గమనించి గాని సద్గురువు కందార్థ విచారణ నాతని కెరిగింపడు. వ్రాత మూలముగా వ్రాసి యీయడు. వ్యాఖ్యానము వ్రాసి అచ్చొత్తించి బజారున అసలే పెట్టడు. కనుకనే సాంప్రదాయక గురుగోష్యము లన్నియు సాకల్యముగా నెరిగినవారయ్యును నిజగురు సంప్రదాయక గురువు లెవరున్ను కందార్థములకు వ్యాఖ్యానము వ్రాసి ప్రకటించుటకు పూను కొనలేదు.

ఇట్టి యెడ, పరిపూర్ణబోధ వున్నదున్నట్లుగా గ్రహించకనే యీ వాఖ్యాత కందార్ధములకు వ్యాఖ్యావము వ్రాసి ప్రకటించ బూనుట కడుంగడు సాహసము, కందార్థ కందముల గ్రంథము రచించిన శ్రీ కృష్ణదేశికులవారి శిష్య ప్రశిష్యులలో గురువులైనవారికడ, యీ వ్యాఖ్యాత కందార్థ విచారణ శ్రవణం చేయలేదు. "తాబేటి తలపు చేతను తాబేల్పిల్లల క్షుదార్తి తలగుట తెలియగా, తాబేటి గర్భమందున తాబేలై పుట్టకున్న తరమా యితరులకూ" అన్లే "యీ బోధ గలవారిచే బోధ బడయాక చేకొనదలచితే తరమా యితరులకూ" అంటూ కృష్ణదాసుగారే ప్రశ్నిస్తున్నారు. పోనీ వ్యాఖ్యాత తన సాంప్రదాయకములోని గురువులవద్ద శ్రవణం చేసినారేమో అంటే అదిన్ని లేదు. శ్రీ పోలకం నర్సింహశెట్టిగారు రచించిన "శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదము" లోని పరిపూర్ణబోధ శ్రీ శివరామదీక్షిత సిద్ధాంతమున కెంత దూరస్తమైయున్నదో యిదివరకే దెల్పియున్నాము. శ్రీ పోకల నర్సింహారావుగారి కందార్ధ వ్యాఖ్యమెంత అపభ్రంశముగానున్నదో ముందుముందు గమనించగలము. ఏది యెట్లున్నా, వారి వ్యాఖ్యానమును యీ వ్యాఖ్యాతయే త్రోసిపుచ్చి నారనుటకు యీ భావార్థదీపికా వ్యాఖ్యయే తార్కాణము. కనుక వీరి భావములు విలక్షణమైన యొక తృతీయ పంథాను అనుసరించినవనీ వీరి బోధ గురుపరంపరా ప్రాప్తమగు బోధ కానేకాదనీ ఋజువు చేయుచున్నవి మరియు వీరి వ్యాఖ్యానము శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంతమునకు కూడ విరుద్ధమైయున్నది. కనుక యీ భావార్థదీపికా వ్యాఖ్య సర్వశః అనాదరణీయము. "గురువులేని విద్య గ్రుడ్డివిద్య" అన్నారు కనుక యీ భావార్థదీపిక యొక గ్రుడ్డి దీపమే దీని అస్పష్ట ప్రకాశము (గుడ్డి వెలుగు) లో యదార్థ జ్ఞాన మెన్నడును కలుగ నేరదు సరిగదా భ్రాంతి జ్ఞానమే సిద్ధించును.

ఐనను స్థాళీపులాక న్యాయముగా, కొన్ని ముఖ్య కందార్థములకు వీరు వ్రాసిన వ్యాఖ్యలను పరిశీలించి విమర్శించి, యీ భావార్థదీపికా బండారమును బయటపెట్టుచున్నాము.

1వ కందార్థ వ్యాఖ్య- భావార్థదీపిక 3వ పేజీ:- "ప్రథమ కబళే మక్షికాపాతః" (మొదటి ముద్దలోనే యీగపడి కంఠమున చిక్కుకొనెను) అన్న రీతిగా యీ మొదటి కందార్థ వ్యాఖ్యలోనే "ప్రత్యక్షముగ కనుపించెడి మేను నేనులు రెండునూ తానుగాదు. మేను నేనుల భ్రాంతినివిడువగా, స్వతస్సిద్ధమై శేషించియున్న అచల పరిపూర్ణ బ్రహ్మ తాను" అని వ్యాఖ్యాత వ్రాసినారు. కాని, "యిది అది కాదు; అది యిది కాదు" అని శ్రీ శివరామ దీక్షితీయ సిద్ధాంతమైయున్నది. యిదివరలో, వీరి సాంప్రదాయములోని గురువు పోలకం నర్సింహశెట్టి గారు రచించిన "శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదము" లోని పద్యములెత్తి చూపినాము. ఇదే అది (అనగా) యెరుకే పరిపూర్ణము పరిపూర్ణమే యెరుక; అనుటయే వీరి సిద్ధాంతమై యున్నదని తేటతెల్లమగుచున్నది.

3వ కందార్థం :- దీనికి వ్యాఖ్యాత అవసరమగు వ్యాఖ్య వ్రాయక చక్కగా కప్పదాటు వేసినారు. అర్థంకాని చోట కప్ప దాటు వేయుట గడుసుదనమే తప్పుడు వ్యాఖ్య వ్రాయుట కంటె యిది మేలే- "ప్రాగర్థ చరమార్థ యోగములకును సంయోగము గావించి, నే గుర్తెరిగినందతా" అను మాటలకు వీరసలు వ్యాఖ్యానమే చేయలేదు. ప్రాగర్ధయోగమేదో, చరమార్ధయోగమేదో, ఆ రెండు యోగములకును సంయోగము గావించి తాను గుర్తెరిగిన దేదో వీరిక్కి తెలియదనుట స్పష్టమే. ఈ మాటలకు పోకల వెంకట నర్సింహారావుగారు "శరీరాత్మలకు సంధానముచేసి, ఆ రెండునూ యొక్కటేయని నేనెరిగినదంతయు"అని వ్రాసిన అర్థము వీరికిన్ని సరిపడ లేదు. సరియగు అర్థమేమో తెలియదు. కనుక చక్కగా కప్పదాటు వేయుట జరిగినది.

శ్రీ కృష్ణదేశికేంద్రులవారి కందార్దములో, తమ కందార్థ గ్రంథము యొక్క నిర్మిత విధానమును గూర్చి చెప్పిరి ఆ నిర్మిత విధానమేమో తెలియకనే, కందార్థ గ్రంథము యొక్క పేరు (Title) లోని "శక్తి

ద్వయ నిరాసకంబైన" అను మాటల అర్థము తెలియక ఆ మాటలను వదలివేసి, వ్రాసిన యీ వ్యాఖ్యానము పాఠకులకు యెంత నిష్ప్రయోజనమో వేరే చెప్పనక్కరలేదు.

32వ కందార్థము :- (అచల లక్షణములలోని మొదటి కందార్థము) (1) పరిపూర్ణ పరబ్రహ్మమును కేవలాత్మ శబ్దముచే వాడుచు యీ వ్యాఖ్యాత 41 పేజీలో ఆ కేవలాత్మకు స్వరూప లక్షణము, తటస్థ లక్షణము, లను అంటగట్టిరి. ఏలక్షణములు చెప్పరాని. సర్వలక్షణ విలక్షణమగు కేవలాత్మకు లక్షణములు చెప్పబూనుట నిజ సిద్ధాంతమునకు ఎంత విరుద్ధము?? (2) అంతటితో నాకలి, కేవల నిరుపాధికమగు పరిపూర్ణ పరబ్రహ్మమునకు సచ్చిదానందములు అఖండోపాధియనియూ, మనస్సు మనోకల్పిత ప్రపంచముఖండోపాధియనియు వ్యాఖ్యాత నిర్ణయించుట మహాఘోరము. మనోవాక్కుల కందని పరిపూర్ణ పరబ్రహ్మమునకు తటస్థలక్షణమట! స్వరూప లక్షణమట! అఖండోపాధియట! ఖండోపాధియట! ఆహా పరిపూర్ణ బోధ విషయంలో యీ వ్యాఖ్యాత మహాగాఢాంధకారమున కొట్టు మిట్టాడుచున్నారనుట నిస్సందేహము, వీరా కందార్థ వ్యాఖ్యానము చేయబూనుట? ఇంతకంటె అనధికారులుండరు.

(3) "వట్టి యాశలు" అను కందార్థములోని మాటలకు, సుఖసాధనముల యందాశ అని వీరి వ్యాఖ్య. వీరు సన్యాసులు కనుక, పరిపూర్ణబోధ అంటే సుఖసాధనములను వదలిన సన్యాస మార్గమనుకొన్నారు. ఎరుక యొక్క మూల భ్రాంతి యెట్లు బంధకారణమైయున్నదో వీరు గుర్తించనే లేదు.

(4) "యెరిగీ భావింపదగునూ: యెరుకలేక సేవించాదగునూ" అని కందార్థములోని మాటలకు వీరు వ్యాఖ్యానమే చేయక మరల కప్పదాటువేసిరి. భావనకు, సేవనకు వుండే తారతమ్యమైన వీరి వ్యాఖ్యలో సూచించలేదు. తెలసియుంటే యేల వ్రాయలేదు?

(5) "ఈ గుట్టు దేశికునోట ఘట్టిగా తెలుసుకొ"మ్మని యీ కందార్థము హెచ్చరిస్తూ వుంటే, ఆ గుట్టు, ఏదో ఎక్కడున్నదో కూడా తెలుపని యీవ్యాఖ్యానమునకు భావార్థదీపిక అని పేరిడుటయే హాస్యాస్పదము.

ఈ కందార్థములో ఎరుకలేక సేవింపదగును అను మాటలు అర్థముగాక పోకలవారచ్చు వేయించిన ప్రతులలో ఎరుకచేత సేవింప దగును అని సవరించి ముద్రించిరి. 1927 వ సం॥రం॥ డిశెంబరు నెలలో "శ్రీ మద్దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారు పోకల వెంకట నర్సింహారావుగారితో చర్చించి "ఎరుకచేత సేవింపదగునూ" అని సవరించుట యెంత దోషమో నిరూపించి అప్పట్లో వారిని ఒప్పించిరి. కాని క్రిందపడినా, మీదనే యున్నాననే వ్యవృత్తిని విడలేక "ఎరుక చేత సేవింపదగును" అనియే వుండవలెనని అందుకు ప్రమాణముగా నర్సింహారావుగారు (తామచ్చు వేయించిన 1939 కూర్పులో) 52. 91, 113, 132, 137, 155 కందార్థములను పేర్కొనిరి. వారి వాదమును త్రోసిపుచ్చి "ఎరుక లేక సేవింపదగును" అని యీ వ్యాఖ్యాత కందార్థములో ముద్రింపించుట ముదావహము, అందుకు మాత్రం వీరి స్వతంత్రబుద్ధిని శ్లాఘింగదగినదే, ఐననూ తన పూర్వ గురువులతో భేదించి యీ వ్యాఖ్యాత నిజ సిద్ధాంతమున కించుక చేరువగా జరిగెనేగాని సిద్ధాంతమును పూర్తిగా అవగాహన చేసుకొననేలేదు. వీరి గురువులూ వీరూ, ఎవరికి తోచినట్లు వారు వ్యాఖ్యానం చేసుకొంటూ, చీకట్లో తడుముకొంటూ పోవుచున్నారని చెప్పకతప్పదు

35 వ కందార్థము :- "దీనికి మ్రొక్కెరితర జేజేలు"- ఆ యితర జేజేలు యెవరు? "ఇది (పరిపూర్ణము) బ్రహ్మ విష్ణు మహే శ్వరాది సమస్త దేవతలు పుట్టక పూర్వమే స్వతస్సిద్ధమై యుండుటచే దీనికితర దేవతలందరు మ్రొక్కుచున్నారు." అవి వీరి వ్యాఖ్య "దీని

కితర దేవతలందరూ మ్రొక్కుచున్నార"నుటలో దీనిని కూడా ఒక దేవతగా వ్యాఖ్యాత భావించినారాయేమి? లేక, ఆ బ్రహ్మాదులు కాని యితర దేవతలని భావించినారా? అగుచో ఆ యితర దేవత లెవరో చెప్పని యీ వ్యాఖ్యాన మెందుకు? ఎవరినుద్ధరించటానికి? "మా గురువుగారు కందార్థములకు వ్యాఖ్యానము వ్రాసిన గొప్ప మహాత్ములు" అవి శిష్యలోకంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించడానికి కాబోలు.

44వ కందార్థము :- (53 పేజీలో) కర్మవలన జన్మ, జన్మ వలన కర్మ అనుట కూడదట జన్మలేనిదే కర్మ యెట్లు చేయబడును? కర్మ చేయకపోయినచో జన్మ మెట్లు కలుగును? అని వీరి ప్రశ్నలు ఇవి ఒక దానినుండి మరియొకటి పుట్టెననినచో, తండ్రి వలన కొడుకు? కొడుకు వలన తండ్రి పుట్టవలయునట. అట్లు పుట్టుననుట సమంజసము కాదుట. ఎందుకు కాదో!! తండ్రివలన తాను పుట్టినాడు. తన సంతానము నకు తాను తండ్రియగుటలేదా? యెందుకు నమంజసము కాదు. "గోశృంగములవలె, కర్మజన్మములోకే పర్యాయము కలుగుచున్నవని చెప్పినచో వానికి కార్యకారణ సంబంధము కలుగనేరదు. కార్యకారణత్వ సంబంధము కలుగనిచో వానికి పుట్టుకలేదని అంగీకరింపవలయును" అంటారీ వ్యాఖ్యాత. ఐతే గోశృంగములసలు పుట్టినవా? పుట్టనేలేదా? పుట్టుట ప్రత్యక్షముకదా! వ్యాఖ్యాత యొక్క మరొక వింత తీర్మానము ఏమంటే "వాస్తవముగా దేనికేదియూ కారణముకాదు. దేనికేదియూ కార్యముగాదు." అని వ్రాసేరు వ్యాఖ్యాత. ఇదొక వింత సిద్ధాంతం. యీ వాఖ్యాత మెదడులోనే ప్రథమతః పుట్టిందేమో? వ్యాఖ్యాత చేసిన యీ చర్చయంతయూ నేలవిడచిన సాముగా నున్నది మరియు స్వవచనా వ్యాఘాతం కూడా సిద్ధించుచున్నది కందార్ధ వ్యాఖ్య ఆద్యంతాలలోసరిగానే తెలియపరచి యీ కాండ తాండవమెందుకో తెలియరాకున్నది తమ తర్క నైపుణంమెంతున్నదో ప్రదర్శించుటకేమో! ఆ నైపుణ్యం యెంత వున్నదో బాగానే తెలిసివచ్చినది. ఇంతకూ వీరి సిద్ధాంత మేమో మాత్రం

తెలియపరిచలేదు "చెట్టే మూలము విత్తుకు, చెట్టుకు మూలంబు విత్తు" అను కందార్థ వాక్యముల మాటఏమి? అవు నంటారా? కాదంటారా? మరి ఏమంటారు యీ వ్యాఖ్యాత!

యీ కందార్థ వ్యాఖ్యానములో, కందార్థమునకు భావార్థము వ్రాసిన తదుపరి వ్యాఖ్యాత 53 పేజీలో "అట్లే అజ్ఞానులు కొందరు కర్మమః వలన జన్మము వచ్చుచున్నదందురు. జన్మములేనిదే కర్మమెట్లు చేయబడును? కర్మము చేయనిదే జన్మ యెట్లు కల్గును? అని ప్రశ్నించు చున్నారు? అట్లే అజ్ఞానులనుటలో వీరు శ్రీకృష్ణదేశికేంద్రులవారిని ఒక అజ్ఞానిగా భావించినట్లా? వీరువేసిన ప్రశ్న విత్తుముందా? చెట్టుముందా?" అన్న ప్రశ్నవలె వున్నది. యిది నిజముగా అజ్ఞానుల ప్రశ్నే. ఏల యనగా విత్తునందు చెట్టు, చెట్టునందు విత్తు సూక్ష్మరూపంలో నున్న వనుట నిస్సంశయము. కనుక విత్తువున్న దంటేదానిలో సూక్ష్మ రూపంలో చెట్టువున్నట్లే. చెట్టువుందంటేదానిలో సూక్ష్మరూపంగా విత్తున్నూ వున్నట్లే. కర్మ (కర్మఫలము) యందు జన్మకారణము జన్మ యందు కర్మఫలము సూక్ష్మంగా వున్నట్లె. రెండున్నూ ఒకేసారి వున్న వని (లేక పుట్టినవి) అని చెప్పవలెను ఈ కందార్థములోని బీజవృక్ష దృష్టాంతమును యీ వ్యాఖ్యాత సంపూర్ణముగా అర్థమే చేసుకొనలేదు. అది జీవుల జన్మకర్మల కుత్పత్తికి చెప్పిన దృష్టాంతమేకాదు. ఎరుక ప్రపంచముల కిచ్చిన దృష్టాంతము. అని వీరి వ్యాఖ్యానములోని చివర 2. 3 వాక్యములు కొంత తేట పరుస్తునేవున్నవి. ఐనను వీరు తమ పిండ దృష్టిని వదలలేక దేహేంద్రియాది ప్రపంచము మాత్రమేగైకొని అంతకే కందార్థ భావనను పరిపుచ్చుకొనిరి. యిది అఖండ యెరుక యొక్క వస్తు నిశ్చయజ్ఞానం లేనందున సంభవించిన దోష దృష్టియని విజ్ఞులు గుర్తించగలరు.

తర్వాత వాక్యములో "ఇవి (జన్మకర్మలు) ఒకదాని నుండి మరియొకటి పుట్టిన దనినచో × × అంటూ తర్కించుట ప్రారంభించి

గౌడపాదాచార్యులవారు తమ మాండూక్య కారికలలో అజాత వాదమునూ సిద్ధాంతములు కాపీ చేసినారు. గౌడపాదాచార్యుల అజాతవాదము, "అజమూ అమృతమూ నగు బ్రహ్మము జీవేశ్వర జగత్తునకుగాని, వాని అధిష్ఠానమునకుగాని కారణముగాదు దానియందు సర్వమునకూ మూలకారణమగు అఖండ యెరుక పుట్టనేలేదు

అజమూ అమృతమూనగు బ్రహ్మమునకు కారణకర్తృత్వములుగాని కారణ కార్యసంబంధముగాని చెప్పరాదు." అని సిద్దాంతం చేస్తున్నది. కాని యీ వ్యాఖ్యాత చేసిన మాదిరిగా 'వాస్తవముగా దేనికేదియూ కార్యమూగాదు'' అని సిద్ధాంతం చేసేటంత మూర్ఖులుగారు గౌడపాదాచార్యులవారు. కారణకర్తృత్వములులేని పరిపూర్ణము కారణ కర్తృత్వములుగల యెరుక, వీనివస్తునిశ్చయ జ్ఞానము లేకపోవుటచే పాపము యీ వ్యాఖ్యాత తికమకపడుచున్నారనుట స్పష్టమే.

(భావార్థదీపిక - ఎరుక లక్షణము)

45 కం॥ (ఎరుకే దేహేంద్రియములు × × ×) భావార్థదీపిక 54వ పేజీ-ఎరుకతోచినతోడనే మొదట దేహేంద్రియ సంఘాతము తోచుచున్నదట! అటుపిమ్మట ఆ సంఘాతము తాననెడి భ్రాంతి అట! తరువాత వర్ణములట! తరువాత ఆశ్రమములట! ఆ తరువాత ఆచారములట! తరువాత అందుకు తగిన శ్రుతులు కల్పించబడెనట! తరువాత భేదభావము, ఆ తరువాత భార్యా పుత్రాది సంసారమట! అటు తరువాత దేవ, మనుష్యాది ప్రాణులు, పంచభూతములు, పర్వతములు, నదులు, తరుగుల్మలతాదులు, చరాచరా ప్రపంచము తోచబడుచున్నది. ఇదీ వీరిసృష్టి క్రమ నిర్ణయము. ఇదియే వీరి ఎరుక నిర్ణయము కాబోలు! వీరి పిండ దృష్టియే ఈ నిర్ణయాలకు హేతువు అఖండ ఎరుక దృష్టి వీరికి లేనే లేదేమో ? అని అనవలసివస్తోంది.

49 కం॥ (57, 58 పేజీలు) "ఎరుక తోచినప్పుడె సమస్త ప్రపంచము తోచుచున్నది. అది పోవునప్పుడు ఈ ప్రపంచమంతయు

దానితోనే మటుమాయమై పోవుచున్నది" అంటారు వ్యాఖ్యాత నామ రూపాత్మక ప్రపంచమంతయు ప్రళయములో లేకపోయినప్పుడు దానితో పాటే ఆ ప్రపంచ సృష్టి కారణమైన ఎరుకకూడ పోవును, అని వీరు ఎంచినట్లగు పడుచున్నది ఇంతమాత్రముచేతనే ఎరుక భ్రాంతిపోతే పరిపూర్ణబోధ ఎందుకు ? మూలకారణమైన ఎరుకపోతే మరల తద నంతర సృష్టికి హేతువైన ఎరుక ఎట్లు వచ్చుచున్నది ? ఆ ఎరుక యొక్క వస్తునిశ్చయజ్ఞానము లేనందుచేతనే ఈ కలత వాక్యములు.

50 కం॥ (వినుమూర్ణనాభి + = +) 58 పేజీ "తుదకది (సాలె పురుగు ఆధారమునందే చిక్కుకొని నాశనమగుచున్నది" ఇది అనుభవమునకు చాల విరుద్ధము సాలెగూడు నందు ఇతర క్రిమి కీటకా దులన్నియు చిక్కుకొని నశించుచున్నవే కాని ఆదారము యొక్క ఉపరిభాగమున యధేచ్ఛా సంచారము చేయు సాలెపురుగు మాత్రము నశించుట కానము. ఈ వ్రాత వ్యాఖ్యాత యొక్క అనుభవ శూన్య తనే చాటుచున్నది. ఇక వీరి పరంపరా మూలపురుషులైన పోకల శేషాచల స్వాములవారు వ్రాసిన తాత్పర్యము ఇంతకంటె మరీ అధ్వాన్నముగా నున్నది (1934 సం॥లో అచ్చు అయిన ప్రతి 18వ పేజీ "నేత్రములయందు బ్రహ్మనాళ మనెడి సన్న రంధ్రము కలిగిన పిమ్మట సృష్టి కలిగి అనేక కోట్ల జీవులను తన లోపలి దారమనెడు హంసచేతనాడించి తానే మటుమాయముగా పోవును," ఇవి పోకల సాంప్రదాయకుల వ్యాఖ్యానాలు. ఇందు భావార్థదీపికా వ్యాఖ్యాతకు తన మూలపురుషునియొక్క వ్యాఖ్యానము ఏమాత్రంనచ్చలేదు, అనీ వీరికి ఒక నిర్ణీత సాంప్రదాయక నిర్ణయమంటూ లేనే లేదని ఎవరికితోచినట్లు వారు వ్యాఖ్యానము వ్రాసుకొనుటే వీరి సాంప్రదాయక పద్ధతి అని తోచు చున్నది, ఇట్టి సాంప్రదాయకము ఎవరైననూ హర్షింపగలరా?

56వ కందార్థం - (భావార్థదీపిక 64, 65 పేజీలు) పిండ బ్రహ్మాండములకున్ను వాని యందలి అహములకున్ను వ్రాయబడిన

వ్యాఖ్య వ్యాఖ్యాతకు వస్తు నిశ్చయజ్ఞానము, మృగ్యము అని చాటు చున్నది, 5 శరీరములు కూడి పిండమట. సమష్టి శరీరములు 5 కూడి బ్రహ్మాండమట. ఆయా శరీరముల అభిమానులు కలిసి, పిండబ్రహ్మాం డములలో అహములుగా నున్నారట.

నాల్గు ఖండములు గూడి అఖండంబగు యెరుక రూపు అని కృష్ణ దాసుగారి కందార్థములో వుంటే యీ వ్యాఖ్యాత అది విస్మరించి ఒక క్రొత్త పంథా త్రొక్కినారు. "వ్యష్టి సమష్టి స్థూల సూక్ష్మ కారణ మహా కారణ శరీరములు వాని యభిమానులు ఎరుక యొక్క ఖండరూపములు. వ్యష్టి సమష్టి కైవల్య శరీరములు వాని అభిమానులైన ప్రత్యక్పర మాత్మలు అఖండ స్వరూపము" అని వ్రాసినారు కృష్ణదాసుగారు చెప్పి నవి నాలుగు ఖండములు, అవి ఏవనగా (1) పిండాండము (2) బ్రహ్మాండము (3) పిండాండమందలి అహము (4) బ్రహ్మాండమందలి అహము అనునవి మాత్రమే, వ్యాఖ్యాత లెక్క ప్రకారం ఖండ రూపము లెన్ని? వ్యష్టియందు స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు, సమష్టియందు స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు మొత్తము యెన్నిమిదిన్ని యీ యెనిమిదింటికి యెన మండుగురు అభిమానులు మొత్తము 16న్ను ఖండరూపములుట. యిక అఖండ రూపమంటే వ్యాఖ్యాత ప్రకారం (1) వ్యష్టి కైవల్య శరీరము (2) సమష్టి కైవల్య శరీరము (3) వ్యష్టి కైవల్య శరీరాభి మానమైన ప్రత్యగాత్మ (4) సమష్టి కైవల్య శరీరాభిమానమైన పరమాత్మ యివి నాలుగూ అఖండ రూపము లుట!!! అనగా అఖండ రూపములు నాలుగున్నవా? అసలు కైవల్య శరీర ప్రసక్తి ఏమైన కందార్థమందున్నదా? కైవల్య శరీరమననేమిటో పిండాండ మంటే యేమో: బ్రహ్మాండమంటే ఏమో, పిండాండమందలి అహమేదో, బ్రహ్మాండ మందలి అహమేదో వస్తు నిశ్చయముగా వ్యాఖ్యాతకు తెలిస్తే యీ తికమక యెందుకు? ఎరుక సంగతియే యెరు

గని వీరు పరిపూర్ణ గురువులట!!! పుట్టి కెగురలేనమ్మ స్వర్గాని కెగుర యత్నించినట్లున్నది.

వీరి మూలపురుషులు తమ వ్యాఖ్యానంలో "పిండమనగా పంచ భూత వికారమైన ప్రకృతి బ్రహ్మాండమనగా పంచభూత స్వరూపమగు మహాప్రకృతి, యీ ప్రకృతులు రెండునూ నీ రెంటిలోని రెండహములు (ప్రత్యగాత్మ పరమాత్మలు అనగా చిత్తును చిదాభాసుడును) యీ నాలుగు ఖండములు గూడి అఖండాకారము నొంది నిష్కళయైయున్న యెరుక రూపము జూడుము" అని వ్రాసినారు. యీ వ్యాఖ్యానము భావార్థ దీపికా వ్యాఖ్యాత విపులపరచదలచుకున్నారో యేమో తెలి యదుగాని అయ్యవార్లంగారిని చేయబోయి కోతినిచేసి వదలిపెట్టినారు.

101 కందార్థము : "అపరోక్షమౌనె మనుజులకు × × × ×" 102 పేజీ భావార్థములో 4వ పంక్తినుంచి "గురుదేవుని అనుగ్రహము కల్గినచో పరోక్షముగా (తనకంటె భిన్నముగా నున్నట్లు తోచుచున్న బట్టబయలగు కేవలాత్మ అపరోక్షముగా) (తనకంటె భిన్నము కారని) తెలియబడుచున్నది, "సద్గురుకృపచే బట్టబయలగు కేవలాత్మ అపరోక్షమని (తనకంటె భిన్నము కాదని) తెలియుటయే దీని రహస్యము" అని వ్రాయబడినది. తానే బట్టబయలు లేక కేవలాత్మ అని వీరి సిద్ధాంతమైయున్నట్లు యింతకంటె ఏమి ఋజువు కావలెను? ఇక "అహంబ్రహ్మాస్మి" అను అద్వైత సిద్ధాంతమునకున్ను యీ పోకలవారి సంప్రదాయక సిద్ధాంతమునకున్ను ఏమి వ్యత్యాసము ? కనుక పోకలవారిది అద్వైత సిద్ధాంతమే కాని శ్రీ శివరామ దీక్షితీయ సిద్ధాంత మెంతమాత్రము కానేరదు. యీ వ్యాఖ్యాత కూడా తాను నేర్చిన అద్వైత సిద్ధాంతమే పరిపూర్ణ భావమని నమ్మియున్నారనుటయూ స్పష్టమే. యిట్టి వీరు తాను కూడా పరిపూర్ణ గురువునని చాటుచూ పరి పూర్ణబోధ మూలగ్రంథములకూ వ్యాఖ్యానము వ్రాయబూనుట లోకమును

వంచించి స్వార్థప్రయోజనములు సాధించుటకుకాక మరింకెందుకు ? అని ఎవరికైన తోచకమానదు.

112 కందార్థమును '' పంచదశాక్షరములను" అంటూ ముద్రణ గావించినారు. 1) పంచదశలుగా వున్న అక్షరములని కొందరంటారుట! పృధివీ, జల, అగ్ని, వాయు, ఆకాశపంచకములు అనగా కర్మేంద్రియ, విషయేంద్రియ, జ్ఞానేంద్రియ, ప్రాణేంద్రియ, అంతరేంద్రియములే యీ దశలట! 2) పంచదశాక్షరములు అనగా 15 అక్షరములని కొంద రంటారట. పంచ బీజములు లేక భూతములు త్రిగుణ భేదముచే 15 అయినవంటారుట. (3) కొందరు పంచాక్షరములు అవి గ్రహించి, పంచబీజములను లేదా నమశ్శివాయ అను మంత్రాక్షరములను గ్రహింతురు. (యిట్లు గ్రహించినది వీరి మూలపురుషులగు పోకల శేషా చలస్వాములే) 4) మరికొందరు పంచదశాక్షరముల అను పాఠము గ్రహించి యేబది అక్షరములని అర్థము చెప్పుదురట.

యీ నాలుగు విధార్థములలో గుణదోషములను వీరు తెలుపలేదు. తామేది అనుసరింతురో కూడ చెప్పలేదు తమ మూలపురుషుడగు పోకల శేషాచలంగారి వ్యాఖ్య తప్పని చెప్పలేక యీ వ్యాఖ్యాత యిచట గూడ నొక కప్పదాటు వేసినారు. యిట్టి వ్యాఖ్యానము పాఠకులకేమి సహాయకారియో తెలియదు.

135 కందార్థము : పోకల శేషాచలంగారున్ను ఈ వ్యాఖ్యాత యున్ను గూడ కందార్థముల ముద్రించుటలో ఈ కందార్థమును "ఈ వట్టి బట్టబయలను నీవిప్పుడు వుండజూచి" అనే ముద్రణచేయించినారు పోకల శేషాచలంగారినే ఈ వ్యాఖ్యాత కాపీ చేసినారనవలెనేగాని, ఆది రాజు తిరుమలరావుగారి వ్రాత ప్రతిని తాను యధాతధముగా వ్రాసు కొన్నాననని చెప్పిన సంగతి నమ్మదగినదిగాలేదు. తిరుమలరావుగారి ప్రతిలో యీ వుత్త బట్టబయలు అని యుండునేగాని వట్టి బట్టబయలని

యుండుట అసంభవము. ఏలననగా పరిపూర్ణబోధ గ్రంథములలో యెచ్చటను వట్టి బట్టబయలు అని ప్రయోగించుట యెరుగము.

209 కందార్థము : ''ప్రవిమల చిత్తుడు శిష్యుడు'' అనేకందార్థములో ఫల, మధు, చిత్రాన్నములు త్రివిధ ప్రసాదములని (కొందరు తారక సాంఖ్య అమనస్కము లంటారని) శేషాచలంగారి వ్యాఖ్య. మధు అనగా మద్యము చిత్రాన్న మనగా మాంసముతో కలిపి వండిన అన్నము అని అర్థము చెప్పుకొని వానిని గురుప్రసాదములని పేరిడి అనుభవించేవారేమో! అది యిప్పటికి కొన్ని దుష్ట సాంప్రదాయక గురు శిష్యులలో నున్నట్లు వినికిడి. పోకలవారి సాంప్రదాయక మిట్టిది కాదుగదా!

త్రివిధ ప్రసాదముల కిచ్చిన శేషాచలంగారి వ్యాఖ్య దుష్టమైనదిగా భావించి యీ వ్యాఖ్యాత మరొక అసంప్రదాయక పంథా త్రొక్కారు. వీరి ప్రకారం మూడు మంత్రములట! అవియే మూడు ప్రసాదములట! అసలు మూడవ మంత్రమని వీరు చెప్పే పంచదశిని దృష్టాంతముగా చెప్పినారే గాని, అది మంత్రమైనట్లు యే పూర్వ గ్రంథములోనైన నున్నదా? కృష్ణదేశికేంద్రులు, "ఆ మంత్ర యుగము దెల్పెద"నన్నారేగాని మంత్ర త్రయమని యెచట పేర్కొనిరి? ఈ పోకల వారి సాంప్రదాయకుడగు కంచి వెంకట్రామన్‌గారు ''మహామంత్ర త్రయభాష్యం'' అంటూ మరొక అసంప్రదాయ గ్రంథము వ్రాసినారు. అదే వీరికి ప్రమాణ గ్రంథము కాబోలు!

254 వ కందార్థము : ''మంతనమున గురుబోధను × × ×'' అన్న కందార్థం శుద్ధప్రతియందు ''సంతకూటముతోడ సంభాషించదు'' అని వుంటే ''సంతకూటముతోడ సంభోగించదు'' అని వ్యాఖ్యాత పరమగురువు శేషాచలంగారూ, "సంతకూటముతోడ సంతోషించదు" అని యీ వ్యాఖ్యాతా తమకు తోచినట్లు ముద్రించి. వ్యాఖ్యానములలో విపరీతార్థములు వ్రాసినారు.

శేషాచలంగారి వ్యాఖ్యానము —"స్వకాంత కూటమిని విడచిపర స్త్రీని బొందిన వాని బ్రతుకెంత హీనమో అంతటి హీనుడు" పరిపూర్ణ బోధ యందు వింతలు లేవని బాధపడుటకున్ను స్వకాంతా విముఖత్వము నకున్ను ఏమి సంబంధమో;

యీ వ్యాఖ్యాత తానచ్చొత్తించిన గ్రంథములో సంభోగించడు అను మాటలు స్థానే సంతోషించడు అని ముద్రింపించినారు.

ఇక వీరి వ్యాఖ్యానములో "సంతలో నొకచోటికి చేరినజనులు వారివారి పనులు ముగియగనే విడిపోయి యెవరి యిండ్లకు వారు వెళ్లి పోవునట్లు ప్రారబ్ధానుసారముగా సంసారమునందొక చోటికి చేరెడి స్త్రీ పుత్రమిత్ర గృహారామ క్షేత్ర ధన ధాన్య, పదార్థములనుజూచి యీ పామరు లివి సత్యములనియు సుఖసాధనములనియు భ్రమించి వారిని గాంచి సంతోషించుచు తుదకెవరిదారినివారు మటుమాయమై పోవు నపుడు యేడ్చుచుందురు" అని వ్రాసినారు. అంటే పామరులు సంసా రమునుజూచి సంతోషింతురా? సంతోషించరా? కందార్థములో సంతో షించడు అని ముద్రించి సంతోషించుచు అని వ్యాఖ్యానించినారు. వీరి వ్యాఖ్యానము నంగీకరిస్తే కందార్థములో సంతోషించును అని యుండ వలెగదా! అట్లులేనపుడు వీరి శిష్యులైనను వీరి వ్యాఖ్యానమునెట్లు అంగీ కరించగలరో తెలియకున్నది.

స్థాళీపులాక న్యాయముగ యీ వ్యాఖ్యాత ప్రకటించిన గ్రంధము, దానికి వారు వ్రాసిన భావార్థదీపికా వ్యాఖ్యానము పరామర్శించితిమి. మూలమునందలి కందార్థములకున్ను వీరు వ్రాసిన భావార్థమునకున్ను పలుచోట్ల యిట్లే విరుద్ధముగనున్నది. యీ గ్రంధమే శుద్ధ ప్రతియని వీరు యింకనూ మొండిగా వాదించినను శ్రీ శివరామ దీక్షితీయ సిద్ధాంతమునకు వీరి భావార్థ దీపిక సంపూర్ణముగ వ్యతిరేకముగనున్నది. గనుక యీసాం ప్రదాయకులిక శివరామ దీక్షిత సాంప్రదాయకులమని చెప్పకొనకుండు టయే వారికిన్ని లోకమునకున్ను శ్రేయస్కరము.

విశ్వమే గుణదోషయుతమైనపుడు ఏ గ్రంథమందైనా గుణ దోషము లుండక తప్పదుగాని, మూలసిద్ధాంతమునకే వ్యతిరేకమైనపుడు అట్టి గ్రంథమును పూర్తిగా నిషేధించుటయే విజ్ఞుల కర్తవ్యము.

ఈ వ్యాఖ్యాత యొక్క అభిమానులు కొందరిదివరకు, మేము సభ పెట్టాము మీరు హాజరవుతారా? అని మాకు వ్రాసినారు. అందుకు ఎల్లపుడు సిద్ధంగా నున్నామని జవాబున్ను యిచ్చినాము. కాని వారే లకో ఆ ప్రస్తావనయే మరల తీసుకొనిరాక మౌనము వహించిరి. మేమిప్పుడొక సభ అందు నిమిత్తము ఏర్పాటు చేయుచున్నాము. స్థలము, తేదీ ముందుగా "రాజయోగి" యందు ప్రకటింపబడును. పోకలవారి సాంప్రదాయకులు, వారి గురువులు యీ వ్యాఖ్యాత లేక మరియెవరైనను వచ్చి ఆ సభయందు మేము చేసిన పరామర్శకు సంబంధించి ప్రశ్నించవచ్చును. వాదించవచ్చును. ఏలాటి అభ్యంతర మున్నూలేదు అని యిందుమూలంగా తెలియజేయుచున్నాము.

## తాజావార్త

(ఒక ముఖ్య ప్రకటన)

ఆదిలాబాద్‌జిల్లా ఆసీఫాబాద్ గ్రామంలోని శివకేశవస్వామి దేవాలయములో ది. 19-11-73, 20-11-73 తేదీలయందు, శ్రీ మద్దయానంద పౌన్నాల రాజయోగీంద్రుల వారి అధ్యక్షతను బహిరంగ సభలయందు పోకలవారి సాంప్రదాయకులు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకము పేరుతో చేయుచున్న అసంప్రదాయక ప్రబోధ ప్రచారములు గర్హించబడును. ఈ సభలలో అందరు పాల్గొన వచ్చును.

మొరిశెట్టి రామలింగం,
కార్యదర్శి, సా॥ బెల్లంపల్లి.

ఆదిలాబాద్ జిల్లా ఆసిఫాబాద్‌లో వేదాంత వైజ్ఞానికసభలు చాలా విజయవంతంగాను జయప్రదముగాను జరిగినవి. సభలు అట జరిపిన వుద్దేశము నెరవేరి, పోకలవారు అసంప్రదాయకులని పూర్తిగా ఋజువుచేయబడినది. పోకలవారు వ్యక్తిగత దూషణలకు దిగినారేగాని వారి వ్రాతలపై "రాజయోగి పత్రికలో చేయబడిన ఒక్క ఆక్షేపణకైన వారు సమాధాన మీయజాలక పోయిరి. ఈ సభలలో పోకలవారు శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయకులు కాజాలరని మరే సాంప్రదాయకమునకు కూడా కట్టుబడినవారుకారని యీ క్రింది కారణములచే నిర్ధారణ చేయబడినది.

(1) ఇది అది కాదు; అది యిది కాదు అని దీక్షితీయ సాంప్రదాయము అనగా ఎరుక పరిపూర్ణములు ఒకటి కావని సిద్ధాంతము. ఎరుకే పరిపూర్ణమని పోకలవారు వారి గ్రంథముఁయందు వ్రాసినారు.

(2) దీక్షితీయ సాంప్రదాయకులు శక్తిద్వయమును నిరసిస్తే, "శక్తిద్వయ నిరాసకంబైన" అను మాటలనే తొలగించి పోకలవారు కందార్థ గ్రంథమును ముద్రింపించిరి.

(3) మంత్రములను పేరుతో చెప్పబడిన గురుబోధ వాక్యములు రెండే అని దీక్షిత సాంప్రదాయక గ్రంథములలో నుండగా, మూడు మంత్రములు అని పోకలవారు నిర్ణయిస్తున్నారు.

(4) దీక్షితీయ సాంప్రదాయకులు చెప్పుకొను గురుపరంపర తప్పని చెపుతూ మూల గురువుల నామములు మార్చి పోకలవారు వేరే మూలపురుషుల నామములు ప్రకటించిరి.

(5) దీక్షితీయ సాంప్రదాయకములో ప్రమాణములగు ముఖ్య కందార్థములను తమ యిచ్చవచ్చినరీతిని తామనుకొన్న అర్థము వచ్చునట్లు సవరించి ముద్రించిరి.

(6) వీరి పరంపరా గురువులు చేసిన వ్యాఖ్యానములనే వీరు అంగీకరించక భిన్నభిన్న వ్యాఖ్యలు చేయుటచే అసలు వీరికి ఒక సాంప్రదాయకమంటూ లేనేలేదని చెప్పక తప్పదు.

(7) తమ పరంపరా గురువులు చేసిన బోధలు తప్పని వాదించే పోకలవారి సాంప్రదాయకులు గురుస్సాక్షాత్ పరబ్రహ్మమని చెప్పుకొనుటకు అర్హత కోల్పోయినారు. గురూపాసన ప్రధానంగా యెంచు దీక్షిత సాంప్రదాయకు లెన్నటికి వీరు కాజాలరు.

(8) వీరే సాంప్రదాయము పేరు చెప్పుకోవలెనోగాని శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయకం పేరు మాత్రం చెప్పుకొనరాదు. అని అసీఫాబాద్ సభలలో సిద్ధాంతము చేయబడినది.

శ్రీవారిచే విజయధ్వజము నాటింపబడినది. శ్రీవారిని వేలాది ప్రజలు జయజయ ధ్వానములతో బసకు తీసుకొని వచ్చిరి. గ్రామపెద్దలు, న్యాయవాదులు, పండితులు, శ్రీవారిని కొనియాడి వారితో కొందరు ఫోటోలు దిగిరి. శ్రీవారిని వక్త్రలను వుచితరీతిని సన్మానించి వీడ్కోలొసంగిరి.

## సభల పూర్వాపరాలు

1973 అక్టోబరు నెల పత్రికలో ప్రకటించబడిన తాజావార్తను చూచుకొని శ్రీ బ్రహ్మానందగిరి వర్గమునకు చేరిన G. లింగయ్యగారు శ్రీదయానంద పొన్నాల రాజయోగిగారికి రిజిస్టరు పోస్టులో ది. 25-10-73 తేదీని ఒక వుత్తరము వ్రాసిరి. అందు బ్రహ్మానందగిరిగారు అపుడా ప్రాంతములోనే యున్నట్లున్నూ సభలో పాల్గొనుటకు వారంగీకరించిరనియు, కాని శాస్త్రార్థము చేయునపుడు పండితులు మధ్యవర్తులుగా నుండుట అవసరమనియు, వుభయవర్గములకు సంబంధములేని యొక్క పండితుడైన నుండనిచో తాము చర్చలో పాల్గొనమనిన్ని తెలియచేసి ప్రత్యుత్తరము వ్రాయవలసినదిగా కోరిరి.

అందుకు శ్రీదయానంద రాజయోగిగారిచ్చిన రిజిస్టర్డు జవాబు పుత్తరంలో "పరిపూర్ణబోధ సిద్ధాంతము తేటతెలుగులో శ్రీశివరామ దీక్షితుల వారిచేతను, శ్రీకృష్ణదేశికేంద్రులచేతను విపులపరచబడినదని శాస్త్రముతోగాని, శాస్త్రార్థముచేయు పండితులతోగాని, నిమిత్తంలేదని, సభలో పుభయవాదనలు విని సభాసదులే న్యాయం తెలుసుకొనగలరని" తెలియపరచిరి.

శ్రీ దయానంద రాజయోగిగారి వర్గమువారు వారికరపత్రములో అసీఫాబాద్ గ్రామంలో శ్రీ శివకేశవదేవాలయంలో 19-11-73, 20-11-73 తేదీలలో ప్రతిదినము ఉదయం 9 గం॥ నుంచి 12 గం॥ వరకున్ను సాయంత్రము 5 గం॥ నుంచి 8 గం॥ వరకున్ను సభలు జరుపబడుననీ, అందు శ్రీ శివరామదీక్షిత దివ్యప్రబోధ విధానము తెలియ పరుస్తూ రాజయోగి పత్రికలో ప్రచురింపబడిన రీతిగా పోకలవారి సాంప్రదాయకులు, అసంప్రదాయకులని ఋజువుచేయబడునని ప్రకటించినారు ఇందుకు పోటిగా.

శ్రీ బ్రహ్మానందగిరిగారి వర్గము వారు అదే దేవాలయంలో 17-11-73 నుండి ది. 21-11-73 తేదీవరకు ప్రతిదినము పుదయం 8 గం॥ నుండియు సాయంత్రము 4 నుండియు వేదాంత మహాసభలు జరుపుదుమనీ, శ్రీ బ్రహ్మానందగిరి, శ్రీ ప్రబోధానంద పుపన్యసింతురని, శ్రీ పొన్నాలరాజయ్యగార్కి రిజిస్టరు నోటీసునకును, శ్రీ మొరిశెట్టి రామ లింగంగారి కరపత్రమును సమాధానములు చెప్పబడునని, చర్చలకు శ్రీయుతులు మల్లావఝుల వెంకటసుబ్బరామశాస్త్రి మొదలగు మహాపండితులు మధ్యవర్తుగానుండి జడ్జిమెంటు చెప్పుదురని, తీర్మానము వెంటనే ముద్రణ చేయించి ప్రకటింపబడుననీ కరపత్రము ప్రకటించిరి. 18 వ తేదీ సాయంత్రమునకు శ్రీ దయానంద రాజయోగిగారు అసీఫాబాద్ గ్రామ మేతెంచునర్కి 17 వ తేదీనుండియు, మల్లావఝుల వెంకటసుబ్బ రామశాస్త్రిగారి భగవద్గీత కాలక్షేపము చేయుచుండిరి గ్రామపెద్దలు

శ్రీ రాజయోగిగారి వద్దకేతెంచి యిరువర్గాలవారు ఒకే వుపన్యాసవేదికనుండి ఒకే బహిరంగసభలో వాదోపవాదములు సాగిస్తే అల్లర్లు జరుగుననే అభిప్రాయముతో శ్రీ బ్రహ్మానందగిరిగారూ మీరూ, మేము ఏర్పాటు చేసిన ప్రత్యేకస్థలమందు ఒక నిర్ణయమునకు వచ్చుట బాగుండునని చెప్పగా శ్రీరాజయోగిగారు వెంటనే అందుకు అంగీకరించిరి. చర్చనీయాంశములేమని శ్రీ బ్రహ్మానందగిరిగారిని గ్రామస్థులడిగితే (1) మీ ప్రబోధవేద సమ్మతమా వేదబాహ్యమా (2) మీరు కొనసాగించు చర్చ శ్రుతి స్మృతులప్రమాణముగా సాగవలెను (3) ఈ చర్చలు ఒక పండితుని సమక్షంలో జరుపవలెను. అని అంటూ "పోకలవారి ప్రబోధ ప్రచారాలు, శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయక ప్రబోధకు విరుద్ధములా కావా అను అసలువిషయమును ప్రక్కత్రోవపట్టించుటకు శ్రీ బ్రహ్మానంద గిరిగారు ప్రయత్నించిరి.

అందుపై శ్రీరాజయోగిగారు, అసలు విషయమును బ్రహ్మానందగిరిగారు ప్రక్కత్రోవ పట్టిస్తున్నారనిన్ని, కనుక (1) శ్రీ బ్రహ్మానందగిరిగారు శ్రీశివరామదీక్షిత సాంప్రదాయకులా ? (2) అగుచో శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధనిర్గుణ కందార్థదరువులని గ్రంథనామమై యుండగా గ్రంథనామంలో బ్రహ్మానందగిరి "శక్తిద్వయ నిరాసకంబైన" అను మాటలను యేల తొలగించిరి ? (3) శ్రీభాగవతుల కృష్ణదేశికులు వ్రాసిన పరంపరను యేల మార్చవలెను ? యీ విషయములకు శ్రీ బ్రహ్మానందగిరి తృప్తికరంగా జవాబులు జరిపితే మేము సభలేజరుపమనీ యీ విషయములు తీర్మానించుపట్ల మధ్యవర్తులుగా పండితులుండవలసిన పని ఏమీలేదని శ్రీవారు గ్రామపెద్దలద్వారా కబురుచేసిరిగాని శ్రీ బ్రహ్మానందగిరి అందుకంగీకరించలేదు. సభలు జరుపవలసియే యుండెను. సభలలో యెదిరిపక్షమును దూషించి వారిని వుద్రేకపరచి అల్లరిలేపి సభలు జరుగకుండాచేసి లేచిపోవచ్చునని వారూహించి వుండవచ్చును కాని, ఇరుపక్షాలవారు ఒకే వుపన్యాసవేదికపై ఒకేసభలో వుపన్యాలు

సాగిస్తే అల్లర్లు చెలరేగునని భయంతో యిరుపక్షాల వుపన్యాసాలకు వేర్వేరు కాలములు మధ్యవర్తులు నిర్ణయించిరి. ప్రతిదినము వుదయం 7 గం॥ నుంచి 9 వరకున్ను, మరల సాయంత్రము 3 గం॥ నుంచి 5 గంటలవరకున్ను బ్రహ్మానందగిరి వర్గమువారున్ను వు:దయం 9 గం॥ నుంచి 12 గం॥ వరకున్ను మరల 5 గం॥ నుంచి రాత్రి 8 గం॥ వరకున్ను శ్రీ దయానందరాజయోగిగారి వర్గీయులున్ను వుపన్యాసములు చేయుటకు యేర్పాటుజరిగెను.

ది 19-11-73 తేదీ వుదయం 6 గం॥ లకు, తాము రాజయోగిలోని విమర్శలకు సమాధానాలు చెప్పుటయేగాక శ్రీవారి సాంప్రదాయక ప్రబోధయే అసంప్రదాయకమని సభలో నిరూపిస్తామంటూ బ్రహ్మానందగిరి లౌడుస్పీకరులో గ్రామమంతా ప్రచురింపచేసిరి.

బ్రహ్మానందగిరిగారు వుదయం సభలో శ్రీ రాజయోగిగారిని, నిందించుటలోనే కాలక్షేపము చేసిరి. వారు అహంకారస్వరూపులట, కోర్టుకెక్కుటయందు వారికి ప్రీతియట, యితరగురువులకు తెలియదని వారిశిష్యులను తనవద్దకు చేర్చుకొనునట! వేదాంతలక్ష్మయ్య, ఆయనను తిట్టిరట, లక్ష్మిరాజ్యం అనేవాడు ఆయన గ్రంథమును విమర్శించెనట. శ్రీరాజయోగిగార్ని నిందించుటయే తనపనిగా పెట్టుకొనెనుగాని రాజయోగి పత్రిక విమర్శకు ఏమియు సమాధానము చెప్పలేదు.

బ్రహ్మానందగిరిగారి వుపన్యాసములో వ్యక్తిదూషణలు అప్రస్తుత ప్రసంగములు అటుంచి యితరవిషయము లేమంటే .——

పొన్నాలరాజయ్యగారి బోధలు వైదిక సిద్ధాంతమునకు విరుద్ధములట! మరియు శివరామదీక్షిత సిద్ధాంతమునకు విరుద్ధములట!

జవాబు :- ఎట్లు విరుద్ధములో ఆయన ఒక్కమాటయైనా చెప్పనేలేదు.

ఇక ప్రబోధానందగిరి యీ క్రింది విషయములు చెప్పిరి. యీ ఆక్షేపణలకు సమాధానములు కూడా మేము ప్రకటిస్తున్నాము.

(1) ఆక్షేపణ :- వశిష్ఠుడు వ్రాసిన, యోగవాశిష్ఠము జ్ఞానవాశిష్ఠం, బృహద్యోగవాశిష్ఠం, అను గ్రంధములను తెలుగులోనికి మార్చేరుట శ్రీ శివరామ దీక్షితులవారు.

సమాధానం :- ఏది యెట్లు మార్చి వ్రాసిరో ఒక్కవుదాహరణమైనా చెప్పనేలేదు. అట్లు మార్చి వ్రాసినారనుటకు ఆధారములున్నా తెలుపలేరు.

(2) ఆక్షేపణ :- కందార్థాలలో నిజసాంప్రదాయకంలేదు వేదాను గుణ్యంగా లేనిది నిజబోధ అనవచ్చునా ?

జవాబు :- తన గురువైన బ్రహ్మానందగిరి ఆయన పూర్వగురువులు నిజబోధగానిది, వేదానుగుణ్యంగాలేనిది అగు ఆకందార్థములను పవిత్ర గ్రంధముగా నెంచి యెందుకు వ్యాఖ్యానములువ్రాసి ముద్రించి ప్రకటించిరో ?

(3) ఆక్షేపణ :- గౌడ పాదాచార్యులవారు అజాతవాదం వ్రాసేరు అదేనిష్పŋతి యోగికబ్రహ్మం ఆ వాదమునే దీక్షితులవారు అచలపరిపూర్ణబోధ అన్నారు.

జవాబు :- గౌడపాదాచార్యులు అజమూ, అమరమూ అయిన బ్రహ్మమునందు ఏదిపుట్టదు అన్నారు. కాని సృష్టికారణమైన వస్తువే బ్రహ్మమని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. సృష్టికారణమైన బ్రహ్మమేదో, తెలుపలేదు. దానిని నిరసింపనూలేదు. కనుక గౌడపాదాచార్యుల వ్రాత పరిపూర్ణబోధ కాదు.

(4) ఆక్షేపణ :- తమ గురువుగారు పరిపూర్ణ పరబ్రహ్మమునకు, జీవ జగదోపాధులు తటస్థలక్షణమనీ, సచ్చిదానందములు స్వరూపలక్షణ మనిన్నీ చెప్పినారని బ్రహ్మానందగిరి రచనను మెచ్చుకొన్నారు

సమాధానము :- పరిపూర్ణ పరబ్రహ్మము సర్వలక్షణ విలక్షణమైనదనీ, కనుక దానికి తటస్థ స్వరూపలక్షణములు చెప్పుట శుద్ధతప్పనీ,

ఆయా లక్షణములు సృష్టికారణమైన బ్రహ్మము (యెరుక) నకే చెప్ప దగునుకాని, పరిపూర్ణ పరబ్రహ్మమునకు చెప్పరాదని మేమిదివరకే రాజయోగి పత్రికలో దెల్పియున్నాము

(5) విషయం :- బ్రహ్మానందగిరిగారి బోధ వేదప్రమాణాను సారం వున్నందున దానిని తమరంతా అంగీకరించిరట.

సమాధానం :- బ్రహ్మానందగిరిగారు పరిపూర్ణమే సచ్చిదానంద బ్రహ్మమని భావించి, పరిపూర్ణబోధను చెపుతానని యెరుక బ్రహ్మమునే బోధించి, అయ్యవారిని చేయబోయి కోతిని తయారుచేసినారు

(6) విషయం :- యీ ప్రాంతంలో శివరామదీక్షిత సాంప్ర దాయక మంటున్నారు. మేము వేదసాంప్రదాయక మంటున్నాము.

జవాబు :- ఐతే మేమూ మాగురువుగారూ వేదసాంప్రదాయకులము శివరామదీక్షిత సాంప్రదాయకులము కాము అని స్పష్టంగా చెప్పుకో రాదా ? చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకొనుట యెందుకు ?

(7) విషయం :- బృహద్వాశిష్ఠ అంటే శివరామదీక్షితులు బోధించినదా ? లేక వశిష్ఠుడు చెప్పిన బృహద్వాశిష్ఠం లోనిదా ?

సమాధానం :- శివరామ దీక్షితీయమనే బృహద్వాశిష్ఠం అని ఆ గ్రంధ నామమే వుండగా వీరికి సందేహమెందుకో ? వశిష్ఠుడు తేట తెలుగులో ఏమైన అసలు వ్రాసినాడా ? పోనీ వశిష్ఠుడు వ్రాసిన గ్రంధాల లోని విషయములకున్ను దీక్షితీయ బృహద్వాశిష్ఠ ప్రబోధకున్ను ముఖ్య విషయము లందెందైన పోలికలున్నవా ? లేవే !

సాయంత్రం సభలో శ్రీ బ్రహ్మానందగిరి చెప్పిన విషయములు అందుకు మాసమాధానములు.

(1) పోకలహరి సాంప్రదాయక బోధవేద సాంప్రదాయకమునకు విరుద్ధమా లేక శివరామదీక్షిత సిద్ధాంతమునకు విరుద్ధమా ? మీ గ్రంధాలు రెంటికీ విరుద్ధమే.

జవాబు :- పోకలవారిబోధ (బ్రహ్మానందగిరి వ్యాఖ్యసహా) దీక్షిత సిద్ధాంతమునకు విరుద్ధమని మేమాదినుంచి పత్రికలలో వ్రాస్తూనే వున్నాము. మాబోధ దీక్షితీయ సిద్ధాంతమును అక్షరాలా అనుసరించినది. కాదని మీరుచెప్పుటకు ఒక్క కారణమైన మీరు చెప్పలేదే !

(2) అనంతోపనిషత్ వుపనిషత్తులలో లేదని రామచంద్రరావుగారన్నారు కాని "త్రిపాద ద్విభూతిమహానారాయణోపనిషత్తు" అరణ్యకాండయందు "త్వమేవ తుర్యాతీతం త్వమేవ అనంతోపనిషత్" అని యున్నది.

జవాబు :- "అనంతోపనిషత్" అని మాటవుంటే చాలా ? "ఉపనిషత్" అనే మాట కర్థం బ్రహ్మమునందు నిలుపునది అని అర్థం. నీవే అనంతమగు ఆబ్రహ్మవు. అని మాత్రమే అర్థము. యిపుడు ముద్రించబడిన అనంతోపనిషత్ మంత్రములా త్రిపాద ద్విభూతి మహానారాయణోపనిషత్తునందు కలవా ? ఒక్క మంత్రమైనలేదే ! కనుక అనంతోపనిషత్ వుపనిషత్తులలో లేనేలేదు

యింతకు యీ త్రిపాద ద్విభూతి మహానారాయణోపనిషత్ యెవరు యెవరికి బోధించిరంటే విష్ణువు బ్రహ్మకు బోధించెను. ఆది గురువు విష్ణువుకాదు బ్రహ్మయని బ్రహ్మానందగిరి అనంతోపనిషత్తును ప్రమాణమిచ్చేరు. ఆ అనంతోపనిషత్ యీ మహానారాయణోపనిషత్తునందు వుందంటారు. కాని యీ మహానారాయణోపనిషత్‌లో విష్ణువు బ్రహ్మకు బోధించినట్లుండగా విష్ణువు ఆదిగురువుకాదు బ్రహ్మయే ఆది గురువని వ్రాయుటకు అట్లు పరంపరను సవరించుట, చూడగా వీరినే మనవలెనో తెలియుటలేదు.

(3) నిజప్రబోధ విధానంలో పొన్నాలరాజయ్యగారు అష్టప్రమాణములని వ్రాసేరు. అన్నీచెత్త. ఏశాస్త్రంలోనూలేదు.

జవాబు :- ప్రత్యక్షాను మానోపమాన శబ్దార్థాపత్త్యను పలబ్ధిష సంభవే తిహ్యాచేష్టానుచ" అని అష్టప్రమాణములకు నిఘంటు ప్రమాణ మున్నది యీయనకు తెలియదు కాబోలు పాపం!

పిమ్మట ప్రబోధానందగిరి యుపన్యాసములోని విషయాలు.

(1) కృష్ణదాసుగారు వ్రాసిన గురుపరంపర శాస్త్రసమ్మతంగాలేదట దాన్ని బ్రహ్మానందగిరి సవరించి వ్రాసేరట.

సమాధానం :- ఏశాస్త్రములోనైనా గురుపరలుంటాయా? మాటి మాటికి శాస్త్రములంటూ వుంటారీయన - శాస్త్రమంటేయేమిటో తెలిసిన వారు యిట్లంటారా? బ్రహ్మానందగిరి వ్రాసిన పరంపర యే శాస్త్రమునకు సమ్మతంగా వుందో?

(2) సచ్చిదానందస్వామి అద్వైతికాదా?

జవాబు :- ఆయన అద్వైతి అని ఎవరేనా ఎప్పుడైనా అన్నారా? "మహాద్వైత పరమతత్వ కందార్థాలు" అంటూ కొన్ని ఆయన వ్రాసేరు. అందుచే ఆయన అద్వైతి అనుకొన్నారేమో! మహాద్వైతమంటే అద్వైతముకాదు దానికతీతమైన పరిపూర్ణభావము.

(3) కందార్థాలు వేదాను గుణ్యంగాలేవు. ప్రమాణంకాదు. అవి గ్రాహ్యములుకావు. త్యాజ్యములే.

జవాబు :- త్యాజ్యములైతే, బ్రహ్మానందగిరి. వారి పూర్వగురువులు, వానిని గ్రహించి భాష్యము లేలవ్రాసిరి?

(4) కృష్ణదాసుగారు విన్నది సాధువుల వద్దగాని గురువుల వద్ద కాదు సాధువు లంటే గృహస్థులు కారు మా బోటివారు.

జవాబు:- సాధువు లంటే అంతఃకరణ వుద్రేకములకు లొంగని వారు. కామక్రోధాదులను విడచినవారు. అంతేకాని సన్యాసివేషధారులు కారు.

(5) వీరి పరంపరలో జనకుని శిష్యుడు శుకుడు అని వ్రాసేరు జనకుడు త్రేతాయుగంవాడు శుకుడు ద్వాపర యుగం వాడు. అతని దగ్గరకు యితడు పోయేడంటే ఎట్లా నమ్మాలి!

జవాబు:- వారు మనవంటి అల్పాయుష్కులుకారు జనకుని శిష్యుడు శుకుడని బ్రహ్మానందగిరి తన భావార్థ దీపికలో వ్రాసి యుండగా వీరి విమర్శనేమనాలి? తన గురు వాక్యము నంచు యీయనకు కూడ ప్రమాణ బుద్ధిలేదేమో!

(6) భగవద్గీత శ్రీకృష్ణు డర్జునునకు బోధించుచుండగా వీరు గురు పరంపరలో వుద్ధవుని తీసుకొన్నారు.

జవాబు :- పరంపరలో "సాందీపమీశం కృష్ణంచ అర్జునం" అని స్పష్ఠంగావుంటే, వీరు గ్రుడ్డిగా విమరిస్తున్నారనే అనుకోవాలి.

19వ తేది ఉదయం గం॥ 9 ల నుంచి రాజయోగి సంపాదకుడు రాజయోగి పత్రికలలో ప్రకటించిన తన విమర్శను సమర్ధించుకుంటూ ఉపన్యాసము గావించిరి. సాయంత్రము సభలోనైన శ్రీ బ్రహ్మానందగిరి గాని ప్రబోధానందగిరి గాని ఆ విమర్శలోని ముఖ్యంశములకైన సమాధానమీయలేదు సాయంత్రము శ్రీ రాజయోగిగారి అధ్యక్షతను జరిగిన సభలో శ్రీ అమలానంద పాటల పండరీనాధుగారు, బ్రహ్మనాందగిరిగారు ప్రభోదనాందగిరిగారు దురహంకార పూరితముగా మాట్లాడినందుకు గర్హించుచు పరిపూర్ణ భావము సాధువుల మార్గమని పరిపూర్ణ స్థితి గల వారు నిందాస్తుతులచే కలత చెందరని తూష్ణి భావముతో ఉపేక్షచేయుదురని వారు నిరహంకారులని, అహంకార రహిత స్థితియే వారి ఆ దర్శమని, శాస్త్రవాసన, విద్యా మతము వారికి యీ షణ్మాత్రములేదని, ఎవరిన్ని వారు సవాలు చేయరని, కోపం గలవారు చండాలురని చెప్పబడుచున్నదని పరిపూర్ణబోధ ఆ దర్శము తెలియజేసిరి. సృష్టి వాదమును గూర్చి శ్రీ పూర్ణానంద కొండమడుగుల వెంకటరెడ్డిగారు ఉపన్యసించుచు మత

వాదము కూడదని, మతము లందు ముక్తి వెదకిన లేదని వేమనాదులు చెప్పినారని చెప్పి ముగించిరి.

మరునాడు అనగా డి. 20-11-73 ఉదయమున శ్రీ బ్రహ్మా నందగిరి మాట్లాడుచు శ్రీ రాజయోగి గారికిగాని రామచంద్రరావుగారికి గాని సంస్కృత భాషరాదని, సంస్కృత వాక్యములకు వ్యాఖ్యానము వ్రాయుట వారికి తగదని చెప్పుచు ఈశావాశ్యా ఉపనిషత్తులోని "తదేజతి తన్నైజతి, తద్దూరె తద్వంతికే ××× " అన్న మంత్రము ఎరుక లక్షణమని పరిపూర్ణ దర్శనములో వ్రాయబడిన విషయము సరికాదని ఆక్షేపించినారు కాని కదలుట కదలక పోవుట అనే ద్వంద లక్షణములు కలది ఎరుకయేయగునుగాని పరిపూర్ణమెట్లగును? అని వీరు యోచించ లేదు. ఎరుకే పరిపూర్ణమని వీరంటారు గనుకనే వీరిని అసాంప్ర దాయకులు' అని అనవలసివచ్చెను. వీరు శ్రీ శివరామదీక్షితీయ సాంప్ర దాయకులు కారనుటకు ఇంతకన్న ఏమి నిదర్శనము కావలెను? "పూర్ణ మదః పూర్ణమిదం ××× అనే మంత్రమును వ్యాఖ్యానించుచు భాషా జ్ఞానముండి కూడ వీరు చాల తికమకపడి, ఉన్నర్థము ఉన్నట్లు గ్రహించ లేకపోయిరిగదా! భాషాజ్ఞానమేగాని అనుభవజ్ఞానము వీరికి లేదని చెప్పు టలో వెనుదీయము.

పిమ్మట ప్రబోధానందగిరి మాట్లాడుచు రామచంద్రరావుగారు, భార్యకు సీరియస్సుగా ఉన్నదని ట్రిక్ టెలిగ్రాము తెప్పించుకొని ఉత్తర కుమారుని వలె పిరికితనముతో పారిపోయినారని, మీరంతా నపుంసకు లని, పౌరుషములేని వారని దూషిస్తూ ఉపన్యాసము ప్రారంభించినారు. భాగవతుల కృష్ణ దేశికుల గ్రంధము ప్రమాణము కాదట! గ్రంధనామమే అర్ధముగాక, గ్రంధార్ధ నిర్మిత విధానమే తెలియక ఇష్టము వచ్చినట్లు వీరు మాట్లాడినారు. పరిపూర్ణ బోధయేమొ తన గురువుకే తెలియదు కదా! వీరికెట్లు తెలియును? పరిపూర్ణ బోధ సాంప్రదాయము గ్రుడ్డి సాంప్రదాయమట గ్రుడ్డి వానికి లోక మంతా గ్రుడ్డి దేయగును కదా!

ఈ దూషణలన్ని వింటూయున్న వాంకిడి పంచాయితీ ప్రసిడెంటు శ్రీ తిరుపతి అయ్యగారు కలుగచేసికొని వారిని గట్టిగా మందలించుటతో బ్రహ్మానందగిరి, ప్రభోదానందగిరి పలాయనము చిత్తగించిరి.

20-11-73 తేది 9 గం॥ తమ ఉపన్యాసములో శ్రీ అమలానంద పాటల పండరినాథుగారిట్లు తెలిపిరి. పరిపూర్ణ బోధ అధికారి, అనధికారులను శివరామ దీక్షితులవారు నిర్ణయించిరని ఆ వాక్యములను చదివి వినిపించిరి వారి పూర్వ గురువుల వాక్యములను ధిక్కరించి బ్రహ్మానందగిరి, ప్రబోధానందగిరిగార్లు గురు ద్రోహమునకు పాల్పడినారు. నేనే పరిపూర్ణమని పోకల వారి భావన అనుటకు నిదర్శనం శ్రీకృష్ణ రుక్మిణి సంవాదంలోని యీ క్రింది పద్యములు. ఆ.వె. నెలతవినుము యింక నీ స్వరూపంబు బట్ట బయలు (2) తే. గీ. పరిపూర్ణం బేనేనని యెరిగియు, నీ దేహమాత్మ,నే గానను న్ పరికింపుము (3) తే.గీ, ఎరుకనేనటంచునెన్నకు, మెరుక నెరుగుకేవ లాత్మమేయటంచు నెరుగు'' "అహం బ్రహ్మాస్మి" అనే అద్వైతమే పోకల వారి పరిపూర్ణము.

వీరి పరంపరలోని కంచి వెంకట్రామన్‌గారు వ్రాసిన అతీత మహా మంత్రత్రయ భాష్యంలో 310 పేజీలో "సునీలమగు కంటి పాపలో మధ్యన శుద్ధ స్ఫటికమువలె ప్రకాశించు ప్రజ్ఞానాత్మయగు యెరుక యందే బట్ట బయలైన అచల పరిపూర్ణ బ్రహ్మము చెలువొందు చున్నది. లేని యెరుకగు నీయందు కూడ చెలువొందు అచల పరిపూర్ణ బ్రహ్మము సేవింపుము. అట్లు సేవించు యెరుక లేక సేవింపుము" అని వ్రాసేరు. వీరి అభిప్రాయము కంటిపాపలోనే పరిపూర్ణమును దర్శింపుమని కదా! మరి కృష్ణ దేశికేంద్రులు యీ వాదమును నిరసించుచూ అది ఆపో జ్యోతి మాత్రమేనని ఒక కందార్థములో సిద్ధాంతం చేసిరి.

పిమ్మట వివేకానంద ఆగోలు సంగయ్యగారు కర్మ నిర్ణయమును గూర్చి ప్రసంగించిరి. ఆ పిదప శ్రీ సహజానంద టి. నాగప్పగారు మాట్లా

డుచూ "ఒకరిని గురించి తెలుసుకోవాలంటే, వారి వ్రాతను, కూతను, చేతను చూడాలి గీతలోనూ, వుత్తర గీతలోనూ చెప్పిన భావములను, కృష్ణ దేశి కేంద్రులు తమ కందార్ధములలో చెప్పుచునే వచ్చేరు. పూరకే. కందార్ధాలు శాస్త్ర సమ్మతంగాదని అంటే సరిపోతుందా? "మంత్రముచే సంతెల్లగు × "అనే కందర్ధము వ్యాఖ్యానిస్తూ, మంత్రము వలన సంతానముగాదు రతిక్రీడ అనే తంత్రము వుంటేనే సంతానము కలుగును" అని వ్రాసేరు. సన్యాసుల వ్రాత యిట్లుండతగునా? ఏమియు తెలుసుకొనకనే కందార్ధములు తప్పను వారిని యేమనవలెనో కృష్ణదేశి కేంద్రులే చెప్పినారు. "తప్పొప్పుల రెంటెన్నెరుగని తప్పు తనందుండి, దీని తప్పనికూసే తప్పుడు నరునకు జెప్పెద చప్పుడు చాలించుమనుచు, సభ వారు. వినగా: సరెసరెనని సభవారిట్లనగా" అనిఒక కందార్ధంలో చెప్పేరు.

మధ్యాహ్నం, 3 గం॥ లకు సభ జరుపలేదు. ఆయన శిష్యుడు ప్రహ్లాదుడు అనే అతడు, తిరు పతయ్యగారి కడకేగి గురువుల నిద్దరినీ ఒక చోటుకు చేర్చి. వారివురు మాత్రమే సంభాషించుకొన్న మీదట పెద్దలు నిర్ణయిస్తే బాగుంటుందనగా తిరుపతయ్యగారు ఆమోదించిరి. ప్రహ్లాదున్ను బెల్లంపల్లి రామలింగంగారి శిష్యుడు భూమయ్యగారున్ను పెద్దలనాహ్వానించిరి. సదా శివయ్యగారి గృహమున సమావేశమేర్పాటు గావించిరి. శ్రీ రాజయోగిగారు తమ సంసిద్ధతను వెల్లడించిరిగాని బ్రహ్మానందగిరి గారం గీకరించరైరి

శ్రీ రాజయోగిగారు సాయంత్రం 5 గంటలకు మాట్లాడురని తెలిసికొని, వారి నాలకించుటకు జనం క్రిక్కిరిసి యుండిరి. సరిగా 5 గంటలకు సభాస్థలికేతెంచి శ్రీ రాజయోగిగారు, తొలుత సృష్టి క్రమమును వివరించి, శూరుని యుద్ధరంగమందునూ, ధీరుని గృహస్థాశ్రమము నందునూ మాత్రమే కాననగుననీ, పూర్ణబోధ గృహస్థల కొరకేననీ, పూర్ణబోధ నిర్ణయ విధాన మెట్లు శ్రీ శివరామ దీక్షితులవారూ, కృష్ణదేశి

కేంద్రులు నిర్ణయించిరో తెలియజేసిరి. తాము 1927 లో మద్రాసు కేగినపుడు పోకలవారి సాంప్రదాయకులను, (కంచి వెంకట్రామన్ వగైరాలు) కలసికొని పోకలవారచ్చు వేయించిన కందార్థములలోని దొసగుల చూపించి అవి యెట్లు సాంప్రదాయక విరుద్ధములో నచ్చు జెప్పితిమని తెలిపిరి. అరిగె రామస్వామిగారు తమకు గల రాజకీయ పలుకుబడిని వినియోగించి స్వార్థ బుద్ధితో "శివరామ దీక్షిత సంస్కార మండలి'' అని ఒక సమాజమును ఏర్పరచి ప్రభుత్వము నుండి ధనార్జన చేయుటకు సంకల్పించిరో, అట్టి మార్గములో బోధ యందు దూష్యములు కనుక వాని నరికట్టుటకై పీఠం రిజిస్టరు చేయించి కోర్టులో దావా కూడా చేయవలసి వచ్చెనని దెల్పిరి, కోర్టు తుది తీర్పు యెట్లు పీఠమునకు అను కూలమో, పీఠాభ్యుదయం అను పేరుతో రామచంద్రరావు వ్రాసి ప్రక టించిన గ్రంథము చూస్తే తెలియగలరు. చతుర్విధ పురుషార్థములు గృహస్తినికే సిద్ధించగలవు కలియుగంలో సన్యాసం దూష్యముగా శాస్త్రములు నిర్ణయించి నిషేధించియున్నవి అని చెప్పి తమ వుపన్యాసము ముగించిరి.

పిమ్మట శ్రీ తిరుపతయ్యగారు లేచి, యిర్వురి గురువులను సమా వేశపరచవలెనని తాము చేసిన ప్రయత్నమెట్లు విఫలమయ్యెనో, శ్రీరాజ యోగిగారందుకు అంగీకరించినా శ్రీ బ్రహ్మానందగిరిగారెందుకో అంగీ కరించలేదనీ వివరించిరి. మీమీ గురువులు వ్రాసిన గ్రంథాల ప్రమా ణములతో మీరు వాదించవచ్చును అని తానుసూచిస్తే, అందుకు మా గురువులు శాస్త్రీయంగా వ్రాయలేదు కనుక మా గురువుల వాక్యాలునాకు ప్రమాణంగాదని ఖచ్చితంగా బ్రహ్మానందగిరిగారు చెప్పినారు. మీగురు వులనే మీరు నమ్మకపోతే మీకు మోక్షమంటూలేనేలేదు. మీకు మోక్షం కలుగకుంటే మీ శిష్యులకు ఎక్కడ మోక్షము? కనుక మీరు సాయంత్రం సభ జరుపరాదు అని నేను చెప్పి వచ్చివేసితిని. ఈ విధంగా తిరుపతయ్యగారు జరిగిన విషయము అంతా సభలో వెల్లడించగా సభ

వారందరూ ముక్త కంఠముతో "శ్రీ మద్దయానంద పౌన్నాల రాజ యోగీంద్రులకు జై!" అంటూ జయ జయధ్వానములు చేస్తూ వుండగా సభ చాలించబడెను.

ది. 21-11-73 తేది వుదయం శ్రీ దుర్గం దేవాజీ గారింటివద్ద విజయ పతాకము ప్రతిష్ఠించి శ్రీవారు వుదయం 9 గంటల వరకు వుపన్యాసం గావించిరి. గృహస్థులకే పరిపూర్ణ బోధయనియు, అది ఏ సాధనలులేని బోధమనియు, యీ బోధ సన్యాసులకు గాదనియు, ఆ వుపన్యాసంగావించిరి. పిమ్మట శ్రీవారు, వుపన్యాసకులు భక్తులు. వాంకిడి ప్రెసిడెంటు తిరు పతయ్యగారు, తెలుగు పండితులైన వెంకటాచారిగారు, యితర గ్రామ పెద్దలు కలసి కూర్చొని గ్రూప్ ఫొటో తీయించుకొనిరి. శ్రీవారికి వుపన్యాసకులకు వుచిత రీతిని సన్మానించి నూతన వస్త్రాదికము లిచ్చి, దేవాజీ ప్రభృతులు వీడ్కోలిచ్చి సాగనంపిరి.

## ఉ ప సం హా ర ము.

ఆదిలో తమ కర పత్రములో ప్రకటించిన ప్రకారం సభా విశేషములు పర్యవసానము గ్రంథ రూపంగా వెంటనే అచ్చొత్తించి ప్రకటింతుమని చెప్పియింత వరకు అట్టి గ్రంధమును బ్రహ్మానందగిరిగారు వెలువరించలేదు. పాపం! తమకు జరిగిన పరాభవమును తామే యెట్లు ప్రకటించుకొందురు. కనుక పీఠము తరపున యీ అసీఫాబాద్ వృత్తాంతము యీ విధంగా ప్రకటింపబడినది.

జై! సద్గురు ప్రభు మహారాజుకీ జై!!

# భక్తమండలి

100-0 మోటూరి భూమయ్య సా॥ నంనూరు సర్పంచు.
100-0 మోటూరి లక్ష్మిరాజం మంచిర్యాల.
100-0 మోటూరి బుచ్చిలింగం భార్య భూమక్క సా॥ నంనూరు.
100-0 యెలుగందుల (లింగయ్యగారి కుమారుడు) నారాయణ వెల్గుమల్లు.
11-0 రేగొండభూమక్క సా॥ లొత్తునూరు.
5-0 కొప్పులలక్షుంబాయి ,,
10-0 చకినాల రాజయ్య సా॥ బొంకూరు.
5-0 కొత్త నర్సయ్య ,,
5-0 చిప్ప మల్లయ్య సా॥ దట్నూరు.
5-0 చిప్ప శంకరయ్య ,,
5-0 చిప్ప రాజయ్య ,,
5-0 చిప్ప నారాయణ డాక్టర్ ,,
5-0 వాసాల యెంబేరు ,,
5-0 కాశ రాజయ్య ,,
5-0 గోలి రామయ్య ,,
5-0 బోయ్ని పెద్దయ్యగౌడు ,, బీసబోయ్ని
5-0 బుర్ర మల్లయ్యగౌ ,,
5-0 దొంతుల లక్ష్మిరాజం ,,
5-0 కుమ్మరి భూమయ్య ,,
5-0 కుమ్మరి రాజయ్య ,,
5-0 మేర నర్సయ్య ,,
5-0 కొండి పోశయ్య ,,
5-0 నొడ్నాల వెంకటనర్సయ్య సా॥ జగదేవుప్యాట
5-0 మాడిశెట్టి భూధక్క ,,
10-0 తోటరాజేశం సా॥ అడవి శ్రీరాంపురం.
10-0 దొడ్డ రమణయ్య సర్పంచు ,,
10-0 దొడ్డ రాజయ్య ,,

10-0 దొడ్డ దశరధం ,,
5-0 కట్కూరి రాజీరు ,,
5-0 కట్కూరి శ్రీహరి ,,
5-0 ఆకోజు నారాయణ ,,
5-0 రాజగట్టయ్య ,,
3-0 శివరాత్రి యీరమ్మ ,,
11-0 గుండా గంగయ్య సా॥ తాళ్ళ ధర్మారం
11-0 ఆల్లెంకి రాజలింగం సా॥ పెద్దపల్లి
11-0 కాచం లక్ష్మిరాజం నంనూరు
12-0 మోటూరి లచ్చయ్య ,,
5-0 మోటూరి వైకుంఠం ,,
11-0 మోటూరి వెంకన్న ,,
5-0 మోటూరి కాశినాధం ,,
11-0 కాచం వాసియ్యగారి కు॥ రాజలింగం ,,
5-0 కాచం వైకుఠం మాస్టర్ ,,
5-0 కాచం నారాయణ ,,
5-0 కాచం రాజయ్య మాస్టర్ ,,
5-0 కాచం బుచ్చిరాజయ్య ,,
5-0 కాచం నారాయణ ,,
11-0 మల్యాల రాజయ్య ,,
11-0 మోటూరి ధర్మయ్య సా॥ మంచిర్యాల
30-0 గాదాసు రాజయ్య ,,
11-0 వల్లాల సీనయ్య ,,
5-0 కొడురుపాక పోచయ్య సా॥ ఆశిఫాబాదు
5-0 జంజరాల లచ్చయ్య ,,
5-0 మోటూరి ధర్మయ్య సా॥ దస్తూరాబాదు
5-0 దొంతుల నారాయణ ,,
5-0 యాంసాని లక్ష్మిరాజ్యం ,,
3-0 మేర పుల్లయ్య ,,

5-0 ఆర్. గంగారాం, డా॥ యం. బి. యెచ్. ఎస్. సా॥ కడెం ప్రాజెక్టు
10-0 పుప్పాల మల్లయ్య సా॥ కన్నాల బొదగుట్టక్క
5-0 మల్క కొమరయ్య ,,
5-0 మల్క నర్సయ్య ,,
10-0 మెండె రాజేశం ,,
5-0 మెండె యెల్లయ్య ,,
5-0 కొట్టె ఐక్కయ్య సా॥ కనగర్తి
5-0 యెదెల్లె నర్సయ్య ,,
12-0 జూపాక రామయ్య సో॥ కాగజునగర్
10-0 కముటాల నారాయణగారు సా॥ పెద్ద కల్వల
10-0 అల్లెంకి మొండయ్య ,,
11-0 వొజ్జల వీరయ్య కొమారుడు మురళి
5-0 నరెందుల తిరుపతయ్య టైపిస్టు సా॥ లక్షెట్టిప్యాట
5-0 బున్నిబోయిన చినరాములు పెద్ద కల్వల
5-0 బున్నిబోయిన్ల లస్మయ్య ,,
5-0 అల్లెంకి లచ్చయ్య ,,
5-0 శ్రీశివరామ దీక్షిత ఆచల గురుమందిరం ,,
5-0 కెశెట్టి వీరేశం ,,
5-0 పామగంటి చెంద్రయ్యగారు సా॥ అమరవాది
5-0 ముత్తెపు నర్సయ్యగారు సా॥ ముదోల్
5-0 బైరాజు వెంకటాచారి సా॥ మందమర్రి
5-0 యెరోజు నారాయణ ,,
5-0 వైద్య వెంకటయ్య మ్యాడారం
10-0 వైద్య సీతయ్య యెల్గటూరు
10-0 జి. నరహరిరావు డా॥ సా॥ యెల్గటూరు
10-0 కె. రామయ్య సర్పంచు ,,
10-0 సంగెం కేశగౌడు ,,
5-0 నేరెల్ల రామయ్య ,,
5-0 బండారు శంకరయ్య ,,
5-0 బండారు నారాయణ ,,
10-0 రెగొండ వైకుంఠం ,,
10-0 వాద గురుపాదం ,,
5-0 కడెం కిష్టయ్య ,,
5-0 మేర బాల్ రాజు ,,

5-0 రాంటెంకి కొండయ్య సా॥ పుల్లిపిట్ట
10-0 దాగం గణపతి ,,
5-0 దుర్గం వికృ ,,
5-0 దుర్గం బాబు ,,
10-0 అరిగెల లక్ష్మయ్యగారు సర్పంచు సా॥ చిర్రకుంట
10-0 దుర్గం బాబురావు ,,
10-0 దుర్గం హెమాజి సా॥ అంకూసి
5-0 దాపిడి బోజయ్య మాస్టరు సా॥ రాంపురం
5-0 పార్వతి హన్మయ్య సా॥ కైర్‌గాం
5-0 దుర్గం లింగయ్య సా॥ వంబేరు
5-0 సునార్‌కారు నాగయ్య ,,
10-0 తోట రామయ్య ,,
10-0 గంటరాంచద్రం సా॥ గోదావరి ఖని
10-0 డి. కె. రాజు ,,
10-0 పెరుమాల్ల మల్లయ్య ,,
10-0 కొట్ల పోశం ,,
10-0 దుబాసి శాయిలు ,,
5-0 బైరం నర్సయ్య ,,
5-0 రావుల రామస్వామి ,,
10-0 యేల్పుల యెల్లయ్య ,,
10-0 గడ్డం బానయ్య ,,
10-0 చెర్కు వెంకటరెడ్డి ,,
10-0 నాముటాబాదు భూఖ్య బాలాజి ,,
5-0 వేముల రాజలింగం ,,
10-0 తునికపల్లె లచ్చయ్య గ్రామం శెకల్ల
5-0 దాగం లింగయ్య బెల్లంపల్లి
5-0 నూతి చెంద్రయ్య ,,
10-0 తోట రామయ్య గోదావరిఖని ,,

---

ముద్రణ : శివాజీ ప్రెస్, సికింద్రాబాదు.